# దాగుడుమూతలు

(నవల)

అనువాదం:

శ్రీ బెల్లంకొండ రామదాసు

# దాగుడు మూతలు

(నవల)



అనువాదం :
శ్రీ బెల్లంకొండ రామదాసు

క్వాలిటీ పబ్లిషర్సు, విజయవాడ-2

2

క్వాలిటీ ప్రచురణ

ప్రథమముద్రణ

1960

మేనేజరు ఎడిటర్

మురళీకృష్ణ

ఎడిటరు

రామారావు

వెల రూ 1—00

లీలా ప్రెస్, విజయవాడ-2

3

# దాగుడు మూతలు

## 1

ఆనాటి సాయంత్రం ఒక హోటల్లో గడిపాము. నా మనస్సు అదోలా వున్నది. ఏమీ తోచక గ్రామఫోను పాటలు వింటూ కిటికీ దగ్గర నిల్చున్నాను. బెర్ట్రాండ్ నా పక్కనే నిల్చుని ఫలహారాలను గురించి వర్ణించసాగాడు. నేను కాసేపు వింటూ అలాగే నిల్చున్నాను. మధ్యలో ఎంచేతనో మనస్సు ఫోనుమీదికి మరలింది. అటు చూచాను. ఫోను రికార్డు మెల్లగా సూదిని అంటుకుంటూ వున్నది. చెక్కిలి చెక్కిలికి ఆనుకున్నట్టు. ఏదో అవ్యక్తమైన ఆనందం నన్ను సముద్ర తరంగంలా ఢీకొన్నది. 'ఒకనాటికి నేనూ కన్ను మూస్తాను శాశ్వతంగా'-అన్న సత్యం ఎంచాతనోకాని నా మనోవీధిలో మెరుపుతీగలా మెరిసింది. అప్పుడు ఇలా ఈ కిటికీ దగ్గర నుంచుని సంధ్యారుణ కాంతిని చూడగలనా మరి ?-

బెర్ట్రాండ్ వంక చూచాను. అతను నా వంకే చూస్తూ వున్నాడు. నేను చిరునవ్వు నవ్వడం గమనించి నా దగ్గరికి వచ్చాడు. నా సుఖం ఆతనితోనే వుంది. మే మిద్దరమూ దగ్గరగా వున్నప్పుడే నేను మధుర క్షణాలను అనుభవించ గలిగాను. నాలో ఈ మధురానుభూతి అవ్యక్తంగా

అప్పుడప్పుడే వికసించడం నేను గమనించాను. కాని ఇప్పుడు నాకు ఈ ఆనందమే భరించరాని బరువుగా కనుపిస్తూవున్నది. పియానోపై 'ఏకాంతం...సాయంత్రం...'-గీతం వినిపిస్తోంది. ఈ పాటలోని అక్షర అక్షరంలో వున్న అవ్యక్తానుభూతి తాలూకు మాధుర్యం నాకు తెలుసు. ఎన్నిసార్లు నాలో నేను ఈ మధుగీతాన్ని గొణుక్కున్నానో మరి !

నాకూ బెర్ట్రాండ్‌కు వున్న పరిచయం తాలూకు వయస్సు ఒకే ఏడాది. ఇద్దరం ఒకేసారి పరీక్షకు కూచున్నాం. ఊపిరి సలపకుండా పరీక్షలకు చదివాం. తరువాత వేసవి సెలవులు గడపడానికి నేను మా నాన్నగారింటికి వెళ్లాను. కడసారి వెళ్లేరోజున బెర్ట్రాండ్‌వద్ద సెలవు తీసుకున్నప్పుడు అతను నన్ను ముద్దాడాడు. తరువాత ఉత్తరాలు వ్రాసేవాడు మొదట్లో మామూలు ధోరణిలో నడిచినవి. వుత్తరాలు. కాని తరువాత తరువాత ధోరణీలు మారుతున్నాయను పించింది. ఒక లేఖలో యిలా వ్రాశాడు. 'అమ్మాయిగారూ! ఒక మాట చెప్పనా ? చెబితే నవ్విపోరుకదూ ! మరి చెబు తాను వినండి! మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను శతవిధాలా!' అని? నేనూ ఇలాగే జవాబు వ్రాశాను-నా మనస్సులో వున్న మాట వున్నట్టు.

'అబ్బాయిగారూ ! నేనూ మిమ్మల్ని ప్రేమిస్తున్నాను'- అంటూ దీన్ని జవాబు అనడంకన్న అతను రాసినదానికి ప్రతి ధ్వని అంటే మరింత సబబుగా వుంటుందేమో అనుకుంటాను. మా నాన్నగారి ఊరు యోనీ నదీ తీరంలో ఉన్నది. మా ఊరవుతే-వెళ్ళానుకాని నాకు ఏమీ తోచేది కాదు.

ఏం చేయాలి మరి ? షికారుగా నదీతీరానికి వెళ్లేదాన్ని. అలలు పరికిస్తూ కాసేపు కాలం గడిపేదాన్ని. అనుక్షణం అతనే జ్ఞాపకం వచ్చేవాడు. 'బెర్ట్రాండు' అతని పేరు. ఒకమంత్రం అయిపోయింది. ఎన్నిసార్లు వల్లించానో మరి ఈ మంత్రాన్ని !

ఉత్తరాలద్వారా అతన్ని నా మనస్సనే పెట్టెలో పెట్టుకుని భద్రంగా దాచుకున్నాను. సెలవులు వెళ్ళిపోయాయి. కొన్నాళ్ళకు అతన్ని మళ్ళీ కలుసుకున్నాను. బెర్ట్రాండ్ నా వెనకాలే నిల్చుని ఉన్నాడు. షర్బత్ గ్లాసు అందించాడు. నేను వెనక్కి తిరిగాను. అతనికీ నాకూ ఎంతో దూరం లేదు. నాకు సాహిత్యం అంటే యిష్టమే. పుస్తకాలవుతే చదువు తాను కాని సాహిత్య చర్చలంటే మటుకు చెడ్డచీదర.

ఏదీ మళ్ళీ ఆ రికార్డుపెట్టు – అన్నాడు బెర్ట్రాండ్. ఇరువురం కలిసి ఆ పాట విన్నాం. నేను బాబాయిని చూడటం కోసం వెళ్ళాలి. నువ్వూ వస్తావా ? అన్నాడు బెర్ట్రాండ్. బెర్ట్రాండ్ వెళ్ళాడు. నేనూ అతన్ని అనుసరించాను. బెర్ట్రాడ్ బాబాయి ఎప్పుడూ దూరదేశాలు పర్యటిస్తూ ఉంటాడు. బెర్ట్రాండ్ నన్ను తనతో రమ్మని అడిగాడేకాని నామటుకు నాకు అతన్ని చూడాలని పెద్ద కోరిక ఏమీలేదు. బెర్ట్రాండ్ నా చెయ్యి పుచ్చుకుని నన్ను నడిపిస్తూ తీసుకుని వెళ్ళాడు. ఇరువురం పక్క పక్కనే నడుస్తూంటే సినిమా పత్రికల్లో హీరో హీరోయిన్ బొమ్మల్లా ఎంతో అందంగా కనుపించాం.

నేను అతన్ని అంటుకునే నడిచాను. మధ్యలో అలుపు కలిగినప్పుడు భుజంమీద తల వాల్చాను. అతని శరీర పరిమళం నన్ను మైమరిపించేది. బెర్ట్రాండ్ నా తొలి ప్రేమికుడు. అతని శరీర పరిమళాన్ని ఆస్వాదించినప్పుడే నేను మొదటి సారిగా నేనంటే ఏమిటో తెలుసుకొనగలిగాను. ఒకవ్యక్తి తనవ్యక్తిత్వాన్ని మరో వ్యక్తితో అనుబంధం ద్వారానే తెలుసుకొనగలడు. బెర్ట్రాండ్ తన బాబాయ్‌ని గురించి మాట్లాడసాగాడు. అతని మాటలనుబట్టి చూస్తే తన బాబాయ్‌పై ఆతనికంత పెద్ద గౌరవం ఉన్నట్లు కనుపించలేదు.

మేము వెళ్ళి చూచేసరికి బెర్ట్రాండ్ బాబాయి మాకోసం కాచుకుని ఉన్నాడు.

లల్ ! ఒక స్నేహితురాలిని తెచ్చానోయ్ – అంటూ బెర్ట్రాండ్ నన్ను అతన్ని పరిచయం చేశాడు.

అతనుఅదోలా ఉన్నాడు. ముఖంలో ఒక విధమైన విషాదరేఖ కనుపిస్తోంది.

ఈ సారి విదేశ పర్యటన ఎలా సాగింది ? – అంటూ బెర్ట్రాండ్ అతన్ని కుశల ప్రశ్నలడిగాడు.

ఏదో అదోలా జరిగింది. మరి నువ్వు కులాసా ? – అని ప్రశ్నించాడు అతను.

రెండు నెలల్లో మేము పరీక్షలకు కూచోబోతున్నాము. అన్నాడు బెర్ట్రాండ్.

'మేము' అన్న పదం అతనిలో ఒక విధమైన ఆశ్చర్యం కలిగించింది. అతను నా వంకచూచి, 'నీకూ పరీక్షలున్నవా ఏమిటి ?' అని ప్రశ్నించాడు.

‘ ఊఁ ’ – అన్నాను – వినిపించీ వినిపించనట్టుగా. బెర్ట్రాండ్ సిగరెట్లు తీసుకుని రావడానికి బైటికి వెళ్లాడు.

‘ఉత్తి చదువేనా ? మీరింకా ఏమైనా చేస్తుంటారా ? ’ అని ప్రశ్నించాడతను.

‘ ఏమీ లేదు ’ – అన్నాను.

‘ ఏమీ చెయ్యను ’ – చెయ్యి పైకెత్తాను. అతను నా చెయ్యి అందుకున్నాడు. నేను అతనివంక అదోలా చూచాను. ఒక అర్ధక్షణంలో నా మనస్సులో యీ భావం మెరుపుతీగలా మెరిసింది.– అతనంటే నాకు యిష్టం. కొంచెం ముసలి. అవుతేనేం ? అతనంటే నాకు ఇష్టం. అతను నా చేతిని టేబిల్ మీద ఉంచుతూ యిలా అన్నాడు :

‘ వేళ్ళకి సిరామరకలు, శుభ లక్షణం. తప్పకుండా పరీక్షల్లో ఫస్టుగా గట్టెక్కుతావు. మంచి లాయరువవుతావు. నీవు మితభాషిగా కనుపించినప్పటికి ప్లీడరీలో అదరకొట్టేస్తావు ’ – అన్నాడు. ఇద్దరం నవ్వాము. స్నేహం తీగలా అల్లుకుంది.

ఈలోగా బెర్ట్రాండ్ తిరిగి వచ్చాడు. లల్ బెర్ట్రాండ్‌తో మాట్లాడసాగాడు. కాని నేను అక్కడ యేమీ వినిపించుకోడం లేదు. లల్ స్వరం మెల్లగా, చల్లగా ఉంది. ‘ నాలాటి అమ్మాయిల మనస్సు ఇట్టే దొంగిలించే ప్రియుడంటే ఇలాగే వుంటాడు. ఇతనే ’ – అనుకున్నాను.

రెండు దినాల తరువాత అతను నన్ను విందుకు ఆహ్వానించాడు.

# 2

విందుకు రెండు రోజులుముందే లల్ ఇంటికి వెళ్లాను. రెండురోజులూ సాదాగా గడిచాయి. పెద్ద పనులేముంటాయి? కాసేపు పరీక్ష పుస్తకాలు చదువుకోడం – కాసేపు చిరు ఎండలో పచార్లు చేయడం, – కాసేపు బెర్ట్రాండ్‌తో ప్రేమ కబుర్లు – ఇలా జరిగాయి రెండు రోజులూను. బెర్ట్రాండ్ నన్ను ప్రేమతో ముంచేశాడు. కాని నేను అందుకు ప్రతిగా ఇచ్చిందేమీ లేదు. సాధ్యమైనంత వరకు ఆత్మసంతృప్తిని సాధించడమే సుఖజీవన గమ్యమని నా ఉద్దేశం.

ఒక విధంగా స్త్రీల హాస్టల్ అని పిలవడానికి వీలున్న గృహంలో నేను నివసించాను. ఈ గృహ యజమానురాలు ఎంతో ఉదార స్వభావురాలు. రాత్రిళ్ళు నేను ఇంటికి వెళ్ళి వస్తూవున్నా ఆవిడ నన్ను ఏమీ అనేదికాదు. నేను నివసించినగది చాలా విశాలంగా వుండేది. గదిని నిరాడంబరంగా ఉంచడమంటేనే నాకు ఇష్టం. లేనిపోని అలంకారాలంటే నాకు తగని రోత. నేను కోరినదల్లా ప్రశాంతి. చుట్టుపక్కల వాళ్ళు నాతో గొడవ పడకుండావుంటేచాలు. అంతకన్న నేను కోరేదేమీలేదు. ఈ ఇల్లంటే నాకు యెంతో యిష్టంగా ఉండేది. ఎంత పట్నంలోవున్నా ఒక గ్రామంలో ఉన్న భావం కలిగేది. కిటికిదగ్గర కూచుని చూస్తే ఆకాశం చెదురు చెదురుగా ఏంతో అందంగా దర్శన మిచ్చేది.

ఇహ నా కార్యక్రమం : ఉదయాన్నే లేచేదాన్ని. కాలకృత్యాలు, ముఖ ప్రక్షాళనాదికాలు తీర్చుకుని బడికి

హాజరయ్యేదాన్ని. భోజన సమయంలో మాత్రమే బెర్ట్రాండ్ కనుపించేవాడు. ఇహ సాయంకాలం పూట, సినిమాలు, షికార్లు, స్నేహితులతో పిచ్చాపాటీ, లైబ్రరీలు — ఇలాగ గడిచేది రోజు. సాయంకాలాల పూట ఎప్పుడైనా బాల్ డాన్స్‌కూడా చేసేవాళ్ళము. ఎప్పుడైనా బెర్ట్రాండ్ గదికి వెళ్ళేదాన్ని. పక్కమీద పడుకుని రతిక్రీడ జరిపిన తరువాత యిద్దరం పక్కమీద అలాగే పడుకుని ఎన్నెన్నో విషయాలు ముచ్చటించుకునేవాళ్ళం. నాకు ఎంతో సుఖంగా ఉండేది. కాని నాలోనాకే తెలీకుండా ఏదో విసకట, ఒంటరితనం, అవ్యక్తమైన ఉత్సాహం, నన్ను నలచి కలచివేశేవి. నాకు లివర్ జబ్బేమైనా ఉన్నదేమో అనుకునేదాన్ని.

శుక్రవారంనాడు కాథరీన్ ఇంటికి వెళ్ళి ఒక గంట దానితో గడిపాను. కాథరీన్ హుషారైన పిల్ల. ఎప్పుడూ ఏదోవాక ప్రణయ కలాపం లేనిదే దానికి తోచదు. నాఅంత నేనుగా దానితో స్నేహం చెయ్యలేదు. దానంత అదే నాతో స్నేహం కుదుర్చుకున్నది. నేను వట్టి అసహాయురాలిననీ, అమాయకురాలిననీ దాని ఉద్దేశం. అది నన్ను గురించి ఇలా భావించడం నాకు ఎంతో ముచ్చటేశేది. ఒక్కొక్కసారి నాకు కాథరీన్ అద్భుతమైన వ్యక్తిగా కనుపించేది. నా అశక్తత దానికి ఎంతో కవితాత్మకంగా కనుపించింది. నన్ను తన కౌగిట్లోకి తీసుకోడానికి పూర్వం బెర్ట్రాండ్‌కు కూడా నన్ను గురించి ఇలాటి భావమే కలిగింది. నేను కాథరీన్‌ను చూడడానికి వెళ్ళిన రోజున కాథరీన్ ఒక దూరపు బంధువుతో కామకలాపం సాగించింది.

కాథరీన్ ఆ విషయాన్నంతా నాకు పూసగుచ్చినట్లు చెప్పింది. అంతా విన్న తరువాత నాకూ ఏదో విషయాన్ని కాథరిన్‌కు చెప్పాలని అనిపించింది. కాని నేను చెప్పడానికి పెద్ద విషయాలేమున్నాయి ? కాథరీన్‌లాగా నాకు ఆనాడు ప్రణయానుభవం ఏమీ లేదు. 'ఈ రోజు బెర్‌ట్రాండ్ ఇంటికి విందుకు వెడుతున్నాను' అది మాత్రం అని ఊరుకున్నాను. ఆ తరువాత మాట్లాడకుండా మూగమ్మలా కూచున్నాను. కాని నా మౌనం దాన్ని ఏమాత్రం ఆశ్చర్య పరచలేదు. ఇది మాకు అలవాటే. అది మాట్లాడుతూంటే నేను మౌనంగా ఉండడమూ, అది సలహా నిచ్చినప్పుడు నేను చెవులను అప్పగించి వినడమూ కొత్తవిషయం కాదు.

ఆ తరువాత లల్ ఇంటికి వెళ్ళాను. ఉత్సాహం కనుపించడం లేదు. నేను లల్ ఇంటికి చేరేసరికి బెర్‌ట్రాండ్ కూడా అక్కడే ఉన్నాడు. తన బాబాయ్ భార్యకి నన్ను పరిచయం చేశాడు. కళకళలాడే ముఖం ఆవిడది. అందం ఒలుకుతూ ఉంది. మంచి భారీ విగ్రహం. చక్కనిది. సాధారణంగా ప్రతి పురుషుడూ కాంక్షించే స్త్రీ అంటే ఇలాగే ఉంటుందేమో అనిపిస్తుంది. ఎంతో సాధువుగా కనుపిస్తుంది. నేనో మరి ? నేను సాధువు కానా ? ఈ ప్రశ్నకి సమాధానం బెర్‌ట్రాండ్ చెప్పాలి. నేను బెర్‌ట్రాండ్ చెయ్యిపుచ్చుకుని కూచున్నాను. ఫాన్స్వాస్ నన్ను ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించింది. ఇల్లంతాచూపించింది. డ్రింకులిచ్చి మర్యాద చేసింది. కుర్చీలో తనంతగా తను చెయ్యి పుచ్చుకుని కూచో బెట్టింది. ఎంతఅణకువ ! ఎంత మర్యాద ! అచ్చం ఇల్లాలు-

నాకు ఎంతో సిగ్గేసిందికూడా. లల్ కోసం మేము కాచుకుని కూచున్నాము. అతనింకా ఆఫీసునుంచి రాలేదు. అతనేం చేస్తున్నాడో నాకు తెలియదు. ఆ విషయాల్లో నేను అంతగా శ్రద్ధచూపనుకూడా.

'చదువు, ప్రేమ' – వీటిలోనే నాకు చెడ్డ ఇంటరెస్టు.

ఏమిటమ్మాయ్! అలాఉన్నావ్? మరికొంచెం విస్కీ సేవిస్తావా?'– అన్నది ఫ్రాన్స్వాస్ చిరునవ్వు చిందిస్తూ.

'ఓ. తప్పకుండా!'– అన్నాను.

'ఓమినిర్ చేపల్లే తాగుతుంది. ఎందుచేతనో తెలుసా?' అన్నాడు బెర్ట్రాండ్.

'ఆవిడ పైపెదవి కొంచెంచిన్నది' – అని వ్యాఖ్యానించాడు బెర్నార్డ్. ఇలా అంటూ నా పైపెదవిని వేలితో ఫ్రాన్స్వాస్‌కు చూపాడు. నేను పసిపిల్లల్లే పగలబడి నవ్వాను. ఈలోగా లల్ వచ్చేశాడు. మళ్ళీ ఒకమాటు లల్ వంక చూచాను. ఈసారి మళ్ళీ! ఎంతో అందంగా కనుపించాడు లల్. అతను నావాడుకాదుకదా అనే బాధ నాలో పొగ తీగలా సాగింది. నేను కోరేవిషయాలే ఎన్నోలేవు. కాని అవే నాకు అందవు. అదీచిత్రం. లల్‌ను చూడగానే నాలో ఏదో అవ్యక్త వాంఛ మొలకెత్తింది. అతనిముఖాన్ని చేతుల్లోకి తీసుకోవాలని పువ్వుని నలిపినట్టు నలిపివెయ్యాలని, అతని పెదవులను గట్టిగా నా పెదవులకు అదుముకుని ముద్దాడాలని నాలో తీవ్రవాంఛ రేకెత్తింది. అతని ముఖం-చూచినప్పుడు పసికుర్రాడికి ఆట బంతిని చూచినప్పుడు కలిగే భావం కలిగింది.

లల్ గదిలో అడుగుపెట్టి మాకు అభినందనలు తెలిపి కూచున్నాడు. అతని నిశ్చలత్వం నాకు ఎంతో ఆశ్చర్యంగా కనుపించింది. ఆ నిశ్చలత నాలో ఏదో చెప్పరాని అశాంతిని రేకెత్తించింది. ఒకసారి ఫ్రాన్స్వాస్‌వంక చూచాను. మరోసారి లల్ వంక చూచాను. విందు ముగిసింది. బైటికి వచ్చాం. నేను లల్ ప్రక్కనే నడవసాగాను. అడ్డరోడ్డు అడ్డువచ్చినప్పుడల్లా లల్ నన్ను చెయ్యి పుచ్చుకుని జాగర్తగా నడిపించేవాడు. అతని కరస్పర్శ సోకి నా చేయి అచేతనంగా మారిందేమో అనిపించింది. లల్ దంపతులు నన్ను ఒక అందమైన బట్టలకొట్టుకు తీసుకుని వెళ్ళారు. ఒక చక్కని కోటు కొని ప్రెజెంట్ చేశారు. ఆ బహుమతిని స్వీకరించాలో నిరాకరించాలోకూడా నాకు అర్ధంకాలేదు. ఎంతో సిగ్గేసింది నాకు. చివరకు కాదనలేక పోయాను.

ఆ దంపతులు మమ్మల్ని ఇంటిదాకా సాగనంపి వెళ్ళారు.

నేను బహుమతిని స్వీకరించినందుకు బెర్‌ట్రాండ్ భగ్గున మండిపడ్డాడు.

'ఇలాంటి ఖరీదైన కోట్లుకొనడానికి నేనే జంకుతాను'- అన్నాడు.

నిజానికి ఆ కోటు నాకు ఎంతో నచ్చింది. నా ఒంటికి అతికినట్టుగా ఉన్నది. అతను అన్నమాటలు నాకు ఎంతో బాధ కలిగించాయి. ఆ విషయం అతనిముఖాన్న అనేశాను. పోట్లాడుకున్నాం. అతను నన్ను కసాయివాడు మేకపిల్లను

నడిపించినట్టు ఇంటికి నడిపించాడు. అతను నాకు విధించనున్న శిక్ష ఏమిటో నాకు తెలుసు.

ఇసువురం మాగది చేరుకున్నాం. అతను నా పక్కనే పడుకుని నన్ను గట్టిగా ముద్దాడాడు. తరువాత మా బాధ ఆనందంగా మారింది.

# 3

తరువాత నాలుగైదు సార్లు లల్ దంపతుల ఇంటికి రాకపోకలు జరిగాయి. ఫ్రాన్స్వాస్ ఎవరో స్నేహితులతో గడపడానికి పది రోజులు సెలవుమీద వెళ్ళింది. ఇప్పుడు ఆవిడకూ నాకూ ఎంతో స్నేహం ఏర్పడింది. ఆవిడదయ అప్యాయత, ఆదరం నన్ను ఎంతో ఆకర్షించాయి. ఆవిడ దయ ఎంతో ఆత్మవిశ్వాసంతో కూడుకున్నది. ఒక్కోసారి ఆవిడ ఎంచాతనో కొంచెం చలించినట్లు కనుపించేది. ఎంత నిబ్బరంగా నిండుగా కనుపించినా ఒక్కోసారి మటుకు వట్టి పసిదానిలా అమాయకంగా వుండేది. ఆ దంపతులు యెప్పుడూ నవ్వుతూ కేరింతలాడుతూ ఎంతో అన్యోన్యంగా వుండేవారు మేము స్టేషన్‌దాకా వెళ్ళి ఆవిడను సాగనంపి వచ్చాము. రైలు కదలబోయేముందు కిటికిలోనుంచి నావంక చూస్తూ 'మా ఆయన్ని నువ్వు కాస్త కనిపెట్టి వుండాలిసుమా' అన్నది.

రైలు వెళ్ళిపోయినతరువాత ఇంటికి వచ్చాం. బెర్ట్రాండ్ ఏదో పత్రిక కొనడానికి దోవలో ఆగాడు. లల్ నావంక చూచి, 'రేపు మన ఇసువురం కలిసి విందు ఆరగించాలి' అన్నాడు.

నేను 'సరే' అనబోయాను. కాని ఇంతలోకి ఆగి, 'సరే' బెర్ట్రాండ్‌తో చెబుతాను. రేపు ఫోన్ చేస్తాను.'— అన్నాను. ఈలోగా బెర్ట్రాండ్ వచ్చాడు. అతనికి కావలసిన పత్రిక దొరకలేదట.

'అమ్మాయ్! ఓ గ్లాసు బీరు పుచ్చుకుందామా?' అంటూ బెర్ట్రాండు నా చెయ్యి పుచ్చుకున్నాడు. అతనూ, లల్, ఒకరివంక ఒకరు అనుమానంగా చూచుకున్నారు. నేను యిద్దరు కొనుగోలుదార్ల మధ్య వున్న మేకపిల్లలా మౌనంగా నుంచున్నాను. ఫ్రాన్స్వాస్ వెళ్ళిపోవడంతో పరిస్థితులన్నీ తారుమారైనాయి. ఇప్పుడిప్పుడే నాకు అసలు సత్యం కళ్ళకు కడుతూవుంది. ఇలాంటి విషమసమయంలో ఫ్రాన్స్వాస్ దగ్గర వుంటే ఎంత బావుండునా అనిపించింది. ఆవిడ చెరుగు చాటున శరణ్యం తీసుకుని వుండేదాన్ని. అబద్ధానికి అలవాటు పడ్డ అందరిలాగానే నేనుకూడా పరిస్థితులకు లోపల చలించినా నేను నిర్వహించబోయే పాత్రను ఎంతో చిత్తశుద్ధితో నిర్వహించడానికి నిశ్చయించుకున్నాను. లల్ మమ్మల్ని ఇంటిదగ్గర వదిలి వెళ్ళాడు. త్వరలోనే కలుస్తామని ఆసిస్తాను'—అన్నాడు సెలవు తీసుకుంటు.

'అమ్మయ్య! ఫ్రాన్స్వాస్ వెళ్ళిపోవడంతో సహం పీడ వదిలినట్టయింది. చూసిన చుట్టాలనే చూడాలంటే నాకు చెడ్డ చిరాకు'—అన్నాడు బెర్ట్రాండ్.

ఈ మాటకు నే నేమీ సమాధానం చెప్పలేదు. ఆ రోజు క్లాస్ రూమ్‌లో పాఠాన్నికూడా సరిగా వినలేక పోయాను. నా మనస్సు పరిపరి విధాల పరిభ్రమించ సాగింది

Belamkonda Ramadasu

లల్ నన్ను విందుకు ఆహ్వానించాడు. నాతో ఒంటిగా విందు ఆరగించాలని అతను అభిలషిస్తూ వున్నాడు. నా పెదవులపై చిరునవ్వు మెరిసింది.



ఆ మరుసటిరోజే విందు. విందు ఎంతో ఆనందంగా గడిచిపోతుందని భావించాను. విందుకు వెడతాను. లల్‌తో కలిసి విందు ఆరగిస్తాను. లల్ ఎంతో ఉద్రేకంతో వచ్చి హఠాత్తుగా తన ప్రేమను నాకు నివేదిస్తాడు. ఇలా ఊహించసాగాను. కాని ఇలాటిదేమీ జరగలేదు. లల్ అతి మామూలుగా వున్నాడు. ఇరువురం కలిసి హాయిగా ఎన్నెన్నో కబుర్లు చెప్పుకున్నాం. ఇంత హాయిని నేను ఇదివరకు ఎన్నడూ చవిచూడలేదు. ఇరువురం కలిసి నృత్యం చేయాలనుకున్నాం. లల్ నన్ను తోటలోకి తీసుకుని వెళ్లాడు. అక్కడ అనేకమంది కూచుని ఉన్నారు. వారిలో లల్ స్నేహితులు కూడా ఉన్నారు. లల్ వెళ్ళి ఆ స్నేహితులతో కాసేపు మాట్లాడి వచ్చాడు. అక్కడ కూచున్న స్త్రీలను చూచినప్పుడు మనకంటే ఎంతో ఆకర్షణీయంగాను ఆధునాతనంగాను వున్నారనిపించింది.

లల్ చిరునవ్వు నవ్వుతూ నన్ను సమీపించి నన్ను నృత్యానికి పిలిచాడు. మెల్లగా నన్ను చేతుల్లోకి తీసుకున్నాడు. ఇరువురం కలిసి నృత్యంచేస్తూ వున్నప్పుడు, నా శరీరం, అతని శరీరానికి లతలా పెనవేసుకుని పోతున్నట్టు అనిపించింది.

ఆ ఆడంగులంటే నీకు చెడ్డ చిరాకుకదూ? ఎప్పుడూ ఏవో ఊసుపోక కబుర్లుచెబుతూ ఉంటారు- అన్నాడు లల్.

'ఇలాంటి నైటుక్లబ్‌ను నేను ఎన్నడూ చూడలేదు. ఈ క్లబ్‌ను చూస్తే నా కళ్లు జిగేల్ మన్నాయి'- అన్నాను. అతను పకాలున నవ్వాడు.

నువ్వు భలేపిల్లవి'- అన్నాడు లల్. తరువాత ఇదువురం కలిసి ఒక పానశాలకు వెళ్ళాం. నిమ్మళంగా విస్కీ పుచ్చుకోడం మొదలెట్టాం. విస్కీ-చుక్క పడితేకాని నా మనస్సులో మాట బైటికి రాదు. ఇలాంటి సందర్భాలలో ఒక స్త్రీ పురుషుడూ కలిస్తే ప్రేమను గురించి ప్రసంగించడం సహజం. ఇదువురం ప్రేమను గురించి ప్రసంగించడం ప్రారంభించాం. ప్రేమించడం, ప్రేమించబడడం, జీవితంలో ఎంతో అవసరమని, ప్రేమలోనే ఆనందం ఉన్నదని లల్ అన్నాడు. అవునన్నట్టు తలఊపాను. తనూ తనభార్యా పరస్పరం ఎంతో గాఢంగా ప్రేమించుకుంటూ ఉన్నారని, అంచేతనే తను సుఖంగా ఉండగలుగు తున్నానని అన్నాడు లల్. అందుకు లల్‌ను అభినందించాను. తరువాత నేను కాసేపు ఏదో పరధ్యానంగా ఆలోచిస్తూ కూచున్నాను.

ఏమైనా - నీతో ప్రేమకలాపం కొత్త మొగ్గ తొడిగినట్టే'- అన్నాడు లల్.

ఆ మాటకు నేను వెర్రి పిల్లలా నవ్వాను.

మరి ఫ్రాన్యాస్ ఏమన్నా అనుకుంటుందేమో' - అన్నాను.

నేను ఆవిడ దగ్గర ఈ విషయాన్ని దాచను. ఆవిడకు నీవంటే ఎంతో యిష్టం' అన్నాడు లల్.

'అదుగో...అదే నేను అంటూవుంట. ఇలాంటి విషయాలను జిల్లీతో టాలు విసిరినట్టు విసిరేస్తే ఎంత నష్టం!'

తరువాత లల్ నన్ను క్వాడిజెర్స్ వద్దకు తీసుకుని వెళ్ళాడు. లల్ కారు ఆపుచేశాడు. ఆకాశం నిర్మలంగా వున్నది. దూరంగా సీన్ నది వెండితీగలా అగుపిస్తూ వున్నది. లల్ కాన్లో నా పక్కనే కూచున్నాడు. నిశ్చలంగా సిగరెట్ పొగను. ఊదుతూ వున్నాడు. నేను చెయ్యి చాచాను. లల్ మెల్లగా నా చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. కారు మా యింటివైపు నడిపాడు. ఇల్లు చేరాము. నేను కారు దిగి 'సెలవు'-అన్నట్టుగా చిరునవ్వు నవ్వాను. లల్ కూడా చిరునవ్వు నవ్వాడు. బట్టలు విడిచి పడుకుని నిద్రపోవాలనుకున్నాను. కాని చివరకు అలాగే వున్నపళాన పడుకుని గురకపెట్టి నిద్రపోయాను.

# 4

మరునటిరోజు వుదయం. బాధగా తెల్లవారింది. క్రితం రాత్రి సమస్య సూర్యోదయంతోపాటు నా కళ్ళముందు నుంచుంది. లల్ నాతో ఒక చక్కని పందెం పెట్టాడు. ఎంతో అందమైన పందెం అది. లల్ పందాన్ని ఎలా నిర్వహించాలో ఎలా ఈ సమస్యను ఎదుర్కోవాలో నాకవుతేమటుకు అర్థం కాలేదు.

ఏది ఏమైతేనేం? అయినా మన చేతుల్లో ఏమున్నది? జీవితం ఒక ప్రవాహం. ఏ ఒడ్డుకు చేర్చినా ఒకటే అనే భావంతో వుదాసీనంగా ఊరుకున్నాను.

రోజులు గడుస్తున్నాయి. క్లాసులకు వెడుతూనే వున్నాను. బెర్ట్రాండ్, ఇతరస్నేహితులు కలుస్తున్నారు. విందులూ వినోదాలూ సాగుతూనే వున్నాయి. కాని అతి మామూలుగా సాగే ఈ దైనందిన కార్యక్రమం నాకు ఎంచాతనో కాని ఎంతో అసాధారణంగా కనుపిస్తూ వున్నది. జీవితం ఏదో స్వప్నంలో సాగినట్టుగా సాగిపోతూవుంది. జాకస్ అప్పుడప్పుడూ నన్ను యెత్తిపొడుస్తూ వుండేవాడు కూడా.

'అమ్మాయ్! నాకు తెలుసు-నీకు ప్రేమపిచ్చి పట్టుకున్నది. బెర్ట్రాండ్-ఏమిటోయ్-ఈ అమ్మాయి మనస్సు ఎవరో దొంగిలించారు!' అనేవాడు జాకస్.

'ఏమో-నాకేం తెలుసు?' అనేవాడు బెర్ట్రాండు.

నేను బెర్ట్రాండ్ వంక చూచాను. అతని ముఖం ఎర్రగా కందగడ్డల్లే వున్నది. సూటిగా నావంక చూడడానికి అతను బిడియపడుతున్నాడు. ఒక సంవత్సరం నాతో గాఢ మైత్రి జరిపిన ఈ వ్యక్తి యిలా హఠాత్తుగా నాకు దూరం కావడం నాకు ఎంతో బాధ కలిగించింది.

'బెర్ట్రాండ్! నాలో యింతలోనే నీకు నమ్మకం పోయిందా? నీవిలా బాధపడటం యెంత మాత్రం సమంజసం కాదు. చూడు - నీ గదిలో మనం యిరువురం కలిసి గడిపిన

ఏకాంత రాత్రులు నీకు జ్ఞాపకంలేవూ? ఇంతలోకే ఈమూడు వారాల్లోనే ఈ అనుభవాలన్నీ చెరిగిపోవలసిందేనా? అనా లనిపించేది నాకు. నేను ఇలా అంటే అతను నన్ను ఓదారు స్తాడని తిరిగి నన్ను తన కౌగిల్లోకి తీసుకుంటాడని అనుకునే దాన్ని. అతను నన్ను ప్రేమించాడు. నిజంగా ప్రేమించాడు. ఆవిషయం నాకు తెలుసు.

కాథరీన్ సలహా పుచ్చుకున్నాను. 'అమ్మాయ్! అన వసరంగా మనస్సు పాడుచేసుకోకు. మగాళ్ళంతా ఇంతే. వట్టి పశువులు. వెడదాం, రా. కాసిని కాఫీనీళ్ళు పోసు కుందాం' అంటూ కాథరీన్ నన్ను బయటికి తీసుకుని వెళ్ళింది. దోవలో కాథరీన్ ఇలా చెప్పసాగింది. 'అమ్మాయ్! బెర్ట్రాండ్ నిన్ను ప్రేమించడం మానేశాడనుకోకు. మధ్య మధ్యలో చిరుజల్లుల్లాగ ఏదో ఇలాటి గొడవలు వస్తూ ఉంటాయి, పోతూ ఉంటాయి." నేను కాథరీన్ మాటను కాదన దలుచుకోలేదు.

'నీవు నన్ను పొరబాటుగా అర్థం చేసుకుంటున్నావు' నేనసలు బెర్ట్రాండ్‌ను గురించి ఆలోచించడమే లేదు' అన్నాను.

కాథరీన్ నోరు తెరుచుకుని వినలేకపోయి నావంక చూచింది.

'నేను సన్యాసినులలో కలవాలనుకుంటున్నాను'- అన్నాను గంభీరంగా.

కాథరీన్ వెంటనే ఒక్క క్షణంకూడా ఆలోచించ కుండా జీవితంలోని అందచందాలను గురించి ఏకరువు పెట్టడం మొదలెట్టింది.

'సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, పక్షులు-ప్రకృతి - వీటిని వదిలిపెడితే'— అంటూ చెప్పసాగింది కాథరీన్ కామసుఖాన్ని గురించికూడా వ్యాఖ్యానించసాగింది.

నామటుకు నాకు కాథరీన్ సలహాలు రోతకలిగించాయి. ఒక అరగంటసేపు వీథుల్లో అటూ ఇటూ పచార్లు చేశాను. కాలం బరువుగా నత్తగుల్లనడక నడుస్తున్నట్టుగా తోచింది. తోచక దుకాణాల్లోకి వెళ్లి ఏవేవో అవీ ఇవీ వస్తువులను బేరంచేశాను. కాని ఒక్కవస్తువూ కొనాలనిపించలేదు. పారిస్ నాది. అనాశక్తులకూ స్వేచ్ఛప్రియులకూ పుట్టినిల్లు పారిస్. ఈవిషయంనాకు ఎంతో కాలంనుంచి తెలుసు కాని ఈవిషయమే నాకు ఎంతో బాధకలిగించేది. నేను ఉత్సాహం తోనూ ఉద్రేకంతోనూ పారిస్ వీథుల్లో నడుస్తూ వెడుతున్నాను. ఏదో అందని అందం, ఆనందం నన్ను ముందుకు లాక్కుని వెడుతూ ఉంది. ఈ అవ్యక్తమైన ఆనందస్థితిలో నాకు ఇంతకుముందు ఎన్నడూ సాక్షాత్కరించని సత్యం సాక్షాత్కరించింది.

సినిమాకు వెళ్ళాను. ఈ హాల్లో అన్నీ పాతసినిమాలే ఆడతారు. ఒక కుర్రాడు వచ్చి నాపక్కసీట్లో కూచున్నాడు. ఎంతో అందంగా ఉన్నాడు కుర్రాడు. మెల్లగా తనచేత్తో నన్ను స్పర్శించాడు. అతనిచేతిని నాచేతిలోకి తీసుకున్నాను.

కిలకిలా నవ్వాలని అనుకున్నాను. మెల్లగా అతని కాలి బొటనవేలితో నాకాలిని గీరాడు. గమ్మత్తుగానే ఉంది ఆట. కాని నాగుండెల్లో రైళ్ళు పరుగిడుతున్నాయి. ఆట మహాత్మ్యమో సినిమా మహత్మ్యమో కాని నాగుండె టకటక లాడుతూఉంది. అతను దగ్గరగా చేరి నన్ను ముద్దాడాడు. నేను అక్కడనుంచి లేచి ఇంటికి వెళ్ళాను. సాత్రే వ్రాసిన "Age of Reason" నవల చదువుతూ కూచున్నాను. ఎంతో అందంగా ఉంది నవల.

ప్రేమించిన వ్యక్తి ఒకడు, ఆకర్షించిన వ్యక్తి ఒకడు- చిత్రంగానే ఉంది నాపరిస్థితి. రాత్రి చాలా ప్రొద్దుపోయే వరకూ నవలచదువుతూ కూచున్నాను. కళ్ళు కూరుకుని వస్తున్నాయి. చివరకు పుస్తకం ఆవలపెట్టి కిటికివద్దకు వెళ్ళి ఆకాశం వంక చూచాను. ఆకాశం నన్నుచూచి చిరునవ్వు నవ్వుతూ ఉందనిపించింది.

## 5

తరువాత రెండువారాలు అనేక పర్యాయాలు లల్‌తో కలిసి షికార్లు వెళ్ళాను. లల్‌కు అనేకమంది స్నేహితులు. అంతా ప్రపంచ యాత్రికులే. వాళ్ళు నాకు రకరకాల కథలు చెప్పేవారు. కులాసాగా కాలక్షేపం చేసేవాళ్ళం. లల్ నన్ను కార్లో ఇంటిదాకా తీసుకొనివచ్చి దిగబెట్టి వెళ్ళేవాడు. నా దగ్గర సెలవు పుచ్చుకుని వెళ్ళబోయేముందు మటుకు నా

చెక్కిలికి చెక్కిలిని ఆనిచ్చి ముద్దాడేవాడు. తరువాత ఒక రోజున మరి రెండు రోజులలో ఫ్రాన్స్వాస్ వస్తుందని చెప్పాడు లల్. ఆవిడ ఊరికి వెళ్ళినప్పటి నుంచి రోజులు స్వప్నంలో గడిచిపోయి నట్టుగా గడిచిపోయాయి.

ఆవిడను కలుసుకోడానికి ఇద్దరం స్టేషన్‌కు వెళ్ళాము. బెర్ట్రాండ్ పది రోజులనుంచి నాకు కనుపించుట లేదు. నన్ను తప్పుకుని తిరుగుతున్నాడు. ఒక్కోసారి బెర్ట్రాండ్‌ను చూడాలని అనిపించేది. కాని ఎలాగో తీరిగ్గాను హాయిగాను ఈ పదిరోజులూ వెళ్ళిపోయాయి.

ఫ్రాన్స్వాస్ వచ్చింది. నవ్వుతూ మమ్మల్ని కౌగలించుకుని ముద్దులవర్షం కురిపించింది. మా ఇరువురి క్షేమ సమాచారాలను ఎంతో ఆప్యాయంగా విచారించింది. "మీరు చాలా చిక్కిపోయారు. బెర్ట్రాండ్ తల్లి నన్ను ఆహ్వానిస్తూ నాకో ఉత్తరం వ్రాసింది. కొన్నాళ్ళు వాళ్ళ గ్రామానికి వెళ్ళి అక్కడ గడిపివద్దాం" అన్నది. నన్నుకూడా రమ్మన్నది. కాని నేను మొదట్లో అందుకు సమ్మతించ లేదు. నన్ను ఆహ్వానించ లేదు. పైగా బెర్ట్రాండ్‌తో నాకు ప్రస్తుతం సంబంధాలు అంత సాఫీగా లేవు. అంచేత నేనూవస్తే సబబుగా ఉంటుందా అన్నాను. కాని ఆవిడ ఎంతో తెలివిగలది. ఎంతటి చిక్కుసమస్యలైనా ఇట్టే పరిష్కరించివేస్తుంది.

ఆవిడ ఓచల్లని చిరునవ్వు నవ్వింది. నేనూ సరేనన్నట్టు ఓ చిరునవ్వు నవ్వాను. ఊరికి వెళ్ళిన తరవాత ఆవిడ కొంచెం ఒళ్ళు పట్టింది. ఆవిడను చూడగానే నా మనస్సు ఒక విధమైన ప్రశాంతితో నిండింది. ఆమె పరోక్షంలో

నేనూ లల్ చేసిన ఆ కార్యాన్ని మరిచాను. ఏమైనా మేము ముగ్గురం పూర్వంలాగానే సాఫీగా సాగిపోవచ్చనే ఆశ నాలో చివురించింది.



ఓనాటి అందమైన సాయంత్రం బెర్ట్రాండ్ తల్లి నివసించే ఊరికి ప్రయాణంకట్టాం. బెర్ట్రాండ్ తల్లి ఎంతో మంచిదట. అందరితోనూ కలేగలుపుగా ఉండే స్వభావం ఆవిడది. ఈ విషయం బెర్ట్రాండే నాతో చెప్పాడు.

నేనూ బెర్ట్రాండ్ ఒక హోటల్‌లో కూచుని ఉండగా లల్ వచ్చి మమ్మల్ని తీసుకుని వెళ్ళాడు. కారు చాలా విసురుగా నడుపుతూఉన్నాడు నేను కిలకిలా నవ్వాను. బెర్ట్రాండ్ కూడా నా నవ్వుతో తన నవ్వును కలిపాడు.

"ఏమిటి అలా నవ్వుతున్నారు !" అని అడిగింది ఫ్రాన్స్వాస్.

"యువతీ యువకులు ఇప్పుడు నవ్వకపోతే మరెప్పుడు నవ్వుతారు?' అన్నాడు లల్.

కాసేపు నిశ్శబ్దం.

'పిల్లా! నీకు కారు డ్రైవింగు నేర్పనా?' అన్నాడు లల్.

లల్ నన్ను 'పిల్లా' అని పిలవడం ఇదే తొలిసారి.

కారు మలుపు తిరిగింది. బెర్ట్రాండ్ నన్ను చేతులతో గట్టిగా పట్టుకుని కూచుని ఉన్నాడు. ఫ్రాన్స్వాస్ మా వంక చూచింది. 'అమ్మాయ్, నువ్వు అతని చేతుల్లో పావురాయి పిట్టలాగున్నావు' అన్నది.

ఆవిడ ముఖంలో దయ, తెలివి మిశ్రమమై కనుపించాయి.

"ముసలిపిట్టని. నాలో ఏదో ముసలి తనం ప్రాకుతూ వస్తున్నట్లనిపించింది" అన్నాను. "ఇప్పుడిప్పుడు నాకూ అలానే అనిపిస్తూంది" అన్నది ఆవిడ.

అవిడ ఈమాట అనగానే లల్ చిరునవ్వు నవ్వుతూ ఆవిడ వంక చూచాడు. అప్పుడు హటాత్తుగా నామనస్సులో ఈ భావాలు మెరుపు తీగల్లా మెరిశాయి: "చిలకా గోరంకల్లా ఉన్నారు. ఈదంపతులు ఒకరిని ఒకరు ఎంతో ప్రేమించుకుంటున్నారు. లల్ భార్యంటే పడిచస్తాడు. ఆవిడను కరుచుకుని పడుకుంటాడు. ఆవిడను నలిపేస్తాడు. ముద్దాడుతాడు. రతి క్రీడలో మైమరపిస్తాడు. ఉయ్యాల లూపుతాడు. స్వర్గ సుఖాన్ని చవి చూపిస్తాడు. కాని లల్ నన్ను గురించి కూడా ఇలాగే భావిస్తూ ఉన్నాడా? నన్ను బెర్ట్రాండ్ తన కౌగిట్లో నలుపు కున్నాడని అసూయ పడుతూ ఉన్నాడా? ఇలాగే ఊహాలల్లుకుంటూ కూచున్నాను. కారు కదిలి పోతోంది. "అదిగో వచ్చేశాం' అన్నాడు బెర్ట్రాండ్.

బెర్ట్రాండ్ తల్లి వచ్చి మమ్మల్ని ఆహ్వానించింది. చెయ్యి పుచ్చుకుని మమ్మల్ని లోపలికి తీసుకుని వెళ్ళింది ఈవిడను నేను ఇంతకుముందు ఎన్నడూ చూడలేదు. మనిషి కొంచెం బొద్దుగా ఉన్నది. పరీక్షల్లో వాచరు, కుర్రాళ్ళ వంక చూచి నట్టుగా నావంక చూశింది. నాకూ బెర్ట్రాండ్ కు ప్రత్యేకంగా ఒక గదిని ఏర్పాటు చేశారు గది విశాలంగా

ఉంది. ఎత్తయిన మంచం 'ఎలా ఉంది గది?' అని అడిగాడు బెర్ట్రాండ్ ఒక విధమైన సిగ్గును నటిస్తూ.

నేను చిరునవ్వు నవ్వాను. బెర్ట్రాండ్ మెల్లగా నన్ను తన కౌగిట్లోకి తీసుకున్నాడు. నా పెదవులకు తన పెదవులను ఆనించి నన్ను ముద్దాడాడు. బెర్ట్రాండ్ ముద్దాడే విధంనాకు తెలియందికాదు.

కాసేపు విశ్రాంతి తీసుకున్నాక విందుకు వెళ్ళాం. మేమే కాకుండా ఇంకా ఎంతోమంది అతిథులు విందుకు హాజరయ్యారు. సాహిత్యాన్ని గురించి, వివిధ తత్వాలను గురించి చర్చలు బయలుదేరాయి.

'ఏమమ్మాయ్ —నువ్వూ సార్త్రేగారి మతం పుచ్చుకున్నావా ఏమిటి?' అన్నాడు ఒక అతిథి నావంక తిరిగి తరువాత అతను బెర్ట్రాండ్ తల్లితో ఇలా వ్యాఖ్యానించ నాగాడు. 'చూడండి — ఈరోజుల్లో కుర్రకారు ధోరణి నాకు అసలు అర్థంకావటమే లేదు. ఏదో అర్థంలేని నిరాశతో ఎప్పుడూ సతమత మవుతూ ఉంటారు. మా రోజుల్లో మేము ఈవయస్సులో ఎలా ఉండేవాళ్ళమో! బెర్ట్రాండ్ తల్లి ఈ మాటలకు పకాలున నవ్వింది. విందుముగిశింది.

అతిథులంతా కులాసాగానే పిచ్చాపాటీ మాట్లాడు కున్నారు. గాలి చల్లగా వీస్తోంది. మేము మేడమీదకు వెళ్ళాం. బెర్ట్రాండ్‌ను విస్కీ తీసుకుని రావటానికి పంపించారు. లల్ నాకుదగ్గరగావచ్చి, 'నువ్వు ఆ టీ త్రాగకూడదు సుమా!' అని చెప్పాడు.

'కాసేపు అలా తోటలోకి వెళ్ళి షికారుచేసివద్దామా?' అన్నాడు లల్. లల్ నన్ను అలా అడిగేసరికి ఎంచేతనో కాని నాకు భయం వేసింది. 'వింధు, చర్చంతో విసికిపోయాం. అలా వెళ్ళి కాస్త గాలి పోసుకుందాం పద' అన్నాడు లల్. నన్ను చెయ్యి పుచ్చుకుని బైటికి తీసుకుని వెళ్ళాడు. అతను నన్ను అలా తీసికుని వెడుతూవుంటే నా వెనకాలనుంచి ఫ్రాన్స్వాస్ కిలకిలా నవ్వడం వినిపించింది.

అతను నన్ను మెల్లగా నడిపిస్తూ తీసుకుని వెడుతు న్నాడు. 'నాకు ఎంచాతనో భయంగా ఉన్నది' అన్నాను లల్‌తో.

అతను నవ్వలేదు. మెల్లగా నా చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. 'లల్ ఎప్పుడూ ఇలాగే ఉంటే ఎంత బావుం డును' అనుకున్నాను. 'వృక్షం లతను రక్షించినట్టుగా నన్ను రక్షిస్తూఉంటే ఎంత బావుండును!' అనుకున్నాను. అతను మధ్యలో ఆగి నన్ను కౌగిల్లోకి తీసుకున్నాడు. నేను మెల్లగా అతని వక్షస్థలంపై వాలి కనులు మూసుకున్నాను. ఇంత కాలం ఈ క్షణంకోసమే కాచుకుని ఉన్నానేమో అనిపిం చింది. మరోవిధంగా చెప్పాలంటే. ఈ క్షణంచేత పట్టుబడ కుండా పారిపోవడానికి యత్నించానేమో ననిపించింది.

అతను నా ముఖాన్ని తన చేతితో నిమురుతూ నన్ను గట్టిగా ముద్దాడాడు. నేను భయపడినదానిలా అతని మెడ చుట్టూ చేతులు పెనవేశాను. మసకచీకటి. ఆ మసకచీకటిలో అతని ముఖం నాకు ఎంతో విడ్డూరంగాను, విచిత్రంగాను కనుపించింది. ఒక్క క్షణంలో నా శరీరమంతా విద్యుత్తు

ప్రవహించినట్లుగా తోచింది. నా కళ్ళల్లో, చెక్కిళ్ళలో చనుల మొనల్లో ఏదో ఝల్లుమన్నట్టు అనిపించింది. ఏదో నూతనానుభూతి నన్ను ఆపాదమస్తకమూ ముంచెత్తింది.

లల్ కౌగిలిని వదిలాడు. నేను కొంచెం తొట్రుపడ్డాను. నన్ను చెయ్యి పుచ్చుకుని తోటలోకి నడిపించుకుని తీసుకుని వెళ్ళాడు.

తెల్లవారేవరకూ అతన్ని అలాగే ముద్దాడుతూ ఉంటే ఎంత బావుంటుందా అని యోచిస్తూ అతని వెనకాలే నడిచాను. బెర్ట్రాండ్ కూడా ముద్దుల మహాత్మ్యాన్ని లల్ నాకు చవిచూపినంత తీపిగా చవిచూపలేదు.

ఆనందమందిరానికి దోవలో ముద్దు ఒక మజిలీ అని మాత్రమే బెర్ట్రాండ్ అభిప్రాయం. మేము మళ్ళీ హాల్లో ప్రవేశించాం.

'కొంచెం ఆలస్యమైంది. క్షమించాలి'— అన్నాడు లల్.

'మించిపోయింది ఏమీ లేదు'— అన్నాడు బెర్ట్రాండ్ అదోవిధంగా.

బెర్ట్రాండ్ నావంక చూచాడు. నేను అతనివంక సూటిగా చూడలేక కళ్లు మరల్చుకున్నాను. కాసేపు నా గదిలోకి వెళ్లి ఒంటరిగా ఉండాలని అనిపించింది. తోటలో గడిపిన మధురక్షణాలను ఒకమాటు నెమరు వేసుకోవాలనిపించింది. కాసేపు ఆ క్షణాల జ్ఞాపకాల పూలను నా మనస్సులోని ఒక అరలో దాచుకుంటాను. తరువాత మళ్లీ తీరిగ్గా ఆ పూలను బైటికి తీసి వాసన చూస్తాను.

గదిలో ఒంటరిగా పడుకుని మనస్సనే పుస్తకం తెరిచి జ్ఞాపకాల పుటలను తిరగవేస్తాను. ఆ పేజీల్లో రాసిన రాత నాకు అందంగా ఆనందమయంగా కనుపిస్తే కళ్లలో దాచుకుంటాను. లేకుంటే ఆ పేజీలు చింపివేస్తాను.

# 6

మ్రుసటి రోజు ఉదయంకూడా మామూలుగా సాగిపోయింది. మెల్లగా చల్లగా నిద్రలేచాను. చిన్ననాటి జ్ఞాపకాలు మనస్సులో మెదిలాయి. ఈ రోజంతా గడపాలి. ఎలాగ? అబ్బ! ఎందరితోనో మాట్లాడాలి. ఎంతో బరువుగా కనుపించింది ఈ బాధ్యత. ఏంచేయాలో తోచక దిండులో తలదూర్చి పడుకున్నాను.

గతరాత్రి అనుభవాలు జ్ఞాపకం వచ్చాయి. లల్ ముద్దులు మనస్సులో తళుక్కుమన్నాయి. నాలోని ఏదో తెర మెల్లగా తొలగించినట్లు తోచింది. స్నానం చేద్దామని స్నానాల గదిలోకి వెళ్ళాను. గది ముచ్చటగా ఉంది. స్నానం చేస్తూ కులాసాగా పాడుకోసాగాను. గోడఅవతల నుంచి ఎవరిదో పిలుపు వినిపించింది.

'అబ్బ! నిద్రపోనివ్వరా ఏమిటి!' — అంటూంది ఆ పిలుపు. చక్కని కంఠస్వరంఅది. నిండుగా ఉంది. లల్ కంఠస్వరం.

అప్పుడు – ఆకంఠస్వరం విన్నప్పుడు నాలో చిత్ర విచిత్రమైన భావాలు గొంగళి పురుగుల్లా ప్రాకులాడ సాగాయి.

నేను ఫ్రాన్స్యాస్‌కన్న పది సంవత్సరాలు ముందుగా పుట్టి ఉన్నట్లవుతే—నేనూ లల్ పెళ్లాడి ఉండేవాళ్లం. అతను నాకు భర్త అయి ఉండేవాడు. నేను స్నానం చేస్తూ ఉన్నప్పుడు పాడడానికి వీలులేదని ఆజ్ఞ పెట్టి ఉండేవాడు. ఒకే పక్కలో పడుకుని నిద్రించి ఉండేవాళ్లం. బ్రతుకంతా చిలకా గోరంకల్లా ఎంతో ప్రేమగా తీయగా గడిపి ఉండేవాళ్లం. కాని ఇప్పుడో మరి? ఒక మలుపులేని వీధిలో ప్రయాణం. ఈ గుడ్డి సందులో ఎందుకు అడుగు పెట్టామో మాకే తెలీదు. అడుగు పెట్టే సమయంలోనే భయంవేసింది. స్నానం చేస్తూ ఇలా ఆలోచించసాగాను. ఎంత ఆలోచించినా సమస్య పరిష్కారం కావడంలేదు. చివరకు ఆలోచించకుండా ఉండడమే మేలనిపించింది. ఏది ఎలా జరగవలసి ఉంటే అలా జరుగుతుందనే నిశ్చయానికి వచ్చి ఊరుకున్నాను.

స్నానం ముగించి బట్టలు వేసుకుని అద్దంలో చూచుకున్నాను. చెరగిన జుట్టు, కోలగా ఉన్న ముఖం, ఏదో విచిత్రమైన భావముద్ర – నాకు నేనే కొత్తగా కనుపించాను. ఈలోగా ఫ్రాన్స్యాస్ మేడమీదికి వచ్చింది. 'ఏమిటే పిల్లా, ఇంకా ఇక్కడే ఉన్నావ్ – అంతా నీకోసం ఎదురు చూస్తూ వుంటే – ఏమిటీ అలక ?'– అన్నది.

'ఏమో నాకు మహా చెడ్డ సిగ్గేస్తోంది'– అన్నాను.

'అదేమిటి? అచ్చం అప్సరసల్లే కనుపిస్తున్నావు—చూడు నేనంటే ముసలిదాన్నయిపోయాను' - అంటూ తన కళ్ళకింద వున్న ముడతలను చూపింది.

నేను నా కొనవ్రేళ్లతో ఆవిడకళ్లను స్పృశించాను. 'ఏమైతేనేం? నీ కళ్లు ఎంతో అందంగా వున్నాయి. ఈ లోకంలో వున్న అందమంతా నీ కళ్లలోనే గూడు కట్టుకుని వుంది'- అన్నాను.

'నువ్వు వట్టి వెర్రిపిల్లవే' - అంటూ ఆవిడ కిలకిలా నవ్వింది. 'నువ్వు ఇక్కడ వున్నా నీ మనస్సు మరెక్కడో వుంటుంది'- అన్నది.

'అంటే ప్రస్తుతం నేను ప్రేమకలాపంలో లేనన్న మాట.'

ఆవిడ నావంక చూచింది.

'అక్కాయ్! లల్ అంటే నేను కరిగిపోతాను. నువ్వన్నాకూడా నాకెంతో ఇష్టం. నన్ను నీతో తీసుకుని వెళ్లవూ ?' - అని అందామనుకున్నాను.

ఆ మాటలు నోటిదాకా వచ్చాయి. కాని ఇంతలోనే సిగ్గేసి ఆపుకున్నాను. ఇంతలో ఆవిడే నన్ను ఇలా ప్రశ్నించింది. 'మరి బెర్ట్రాండ్ విషయం ఏమిటి ? అంతా ముగిసినట్టేనా ?'

'ఊఁ' – అన్నాను.

'మరి, ఆ విషయం అతనితో చెప్పవద్దా ?' -

ఈ ప్రశ్నకు నేనేమీ సమాధానం చెప్పలేదు. మౌనంగా ఊరుకున్నాను.

ఆవిడ చిరునవ్వు నవ్వింది. 'అవును. నాకు తెలుసు. ఇలాటి విషయాలు చెప్పడం ఎంతో కష్టం...ఇహ పోనిద్దూ భోజనానికి వెడదాం రా'— అంటూ నన్ను చెయ్యి పుచ్చుకుని తీసుకుని వెళ్లింది.

ఇద్దరం ముచ్చట్లు చెప్పుకుంటూ మేడమెట్లు దిగి వెళ్లాం. బట్టలను గురించి, జాకెట్లను గురించి, మరి ఎన్నెన్నో విషయాలు మాట్లాడుకున్నాం. ముఖ్యమైన విషయాలను గురించి మాట్లాడడంకంటే ఇలాటి విషయాలను గురించి మాట్లాడడం ఒక్కొక్కసారి ఎంతో మేలనిపిస్తుంది.

మేము వెళ్లేసరికి బెర్ట్రాండ్, లల్ పక్క పక్కనే కూచుని భోజనం చేస్తూ వున్నారు.

భోజనం ముగించిన తరువాత ఈతను వెళ్లడాన్ని గురించి ఇద్దరూ ముచ్చటించుకున్నారు.

నేను ఫ్రాన్స్యాస్‌కూడా ఫలహారాలు ముగించాం.

ఈతను కావలసిన బట్టలన్నీ సర్దుకుని బయలుదేరాం. బెర్ట్రాండ్, అతని తల్లి, ఇతర అతిథులు ఒక కార్లో కూచున్నారు.

నేను, లల్, అతని భార్య మరో కార్లో బయలు దేరాం. 'ఈమాటు నువ్వు కారు నడపాలి'— అన్నాడు లల్.

కారు డ్రైవింగు నాకంత అలవాటు లేదు. అయినా యత్నించాను. ఎలాగో ఒకలా కారు నడుస్తూనే వుంది. లల్ నా పక్కనే కూచున్నాడు. ఫ్రాన్స్యాస్‌మటుకు వెనకసీట్లో కూచుని ముచ్చట్లు చెబుతూ ఉన్నది. 'ప్రమాదం జరగకుండా

కారు. తోలవే అమ్మాయ్'- అంటూ నన్ను హెచ్చరిస్తూ వున్నది.

నేనూ కారు నడుపుతూ ఏవేవో ముచ్చట్లు చెబుతూ వున్నాను

'నేను ఇంతవరకు ఎన్నడూ సముద్రం అంటే ఎలా వుంటుందో చూడలేదు' అన్నాను. అంతా ఆశ్చర్యపోయారు.

'వచ్చేవారం నిన్ను సముద్రందగ్గరికి తీసుకునివెడతాం' అన్నాడు లల్.

ఒక క్షణం తరువాత మా కారు ఒక పెద్ద మైదానం చేరుకుంది. పచ్చికబయలు. బయలు మధ్యలో ఒక పెద్ద కొలను. నీలాల నీరు. మేము ఒక్క క్షణంలో బేతింగ్ సూట్లు వేసుకుని కొలనుబడ్డున నుంచున్నాం.

కొలను దూకాలంటే నాకు మొదట్లో భయంవేసింది. కాని కొలనులో దూకిన వెంటనే భయం ఒక్క క్షణంలో మాయమైపోయింది.

# 7

సెలవులు ముగిశాయి. మళ్లీ నగరం చేరుకున్నాం. ఒకరోజు సాయంత్రం లల్‌ను కలుసుకుంటానని చెప్పాను. ఒక బార్‌లో సంకేతం ఏర్పరుచుకున్నాం. నేను వెళ్లి చూచే సరికి లల్ అక్కడే వున్నాడు. నేను వెళ్లి అతని పక్కనే కూచుని రెండు విస్కీ ఆర్డర్ చేశాను. 'బెర్ట్రాండ్ ఎలా వున్నాడు ?'- అని ప్రశ్నించాడు లల్.

'కులాసాగానే వున్నాడు'- అన్నాను.

'చాలా తల్లకిందులైపోయా డనుకుంటాను'- అని అడిగాడు లల్ అవహేళనగా.

'అదేం ?'

'అతను వట్టి వెర్రివాడనుకున్నావా ?'

'అయినా అతని విషయం మనం మాట్లాడడం ఎందుకు ? అతను...'

'అంత ముఖ్యమైన వ్యక్తి కాదంటావా ?'-

ఈ మాట లల్ కంఠస్వరంలో మరింత అవహేళన కనుపించింది. నేను కోపాన్ని దిగ్రమింగుకోలేకపోయాను.

'అతను ముఖ్యమైన వ్యక్తి కాదనికాదు నా ఉద్దేశం. కాని అతన్నిగురించి మనం మాట్టాడుకోడం అనవసరం. మరి అంత ప్రధానమైన విషయాలనే మనం మాట్లాడుకోదలిస్తే ఫ్రాన్యాస్ విషయం ఏమిటి ?-

లల్ నవ్వాడు. 'బెర్ట్రాండ్ ఏమాత్రం బాధపడుతున్నాడనే విషయం నాకు తెలీదు.'

'నేను వివాహం చేసుకుని పది సంవత్సరాలు కావస్తూంది. ఫ్రాన్యాస్ బాధపడిన అనేక క్షణాలను నేను అనుభవంలో చూచాను. నిజంగా నాకు ఎంతో విచారం కలిగింది.'

ఒక క్షణం పాటు ఇరువురం మాట్లాడుకోకుండా కూచున్నాం. ఇరువురం బహుశా ఆ క్షణంలో ఆవిడను గురించే ఊహించుకుంటూ ఉండవచ్చు.

లల్ విస్కీగ్లాసు ఖాళీచేశాడు. ఒక సినిమా చూచి నట్టుగా అతను విస్కీగ్లాసును ఖాళీచేయడం పరికిస్తూ కూచు న్నాను. తరువాత లల్ ఇలా చెప్పసాగడు: 'చూశావ్ అమ్మాయ్ - నేను ఫ్రాన్యాస్‌ను వివాహం చేసుకుని ఇప్పటికి పదిసంవత్సరాలు కావస్తూ ఉంది. నా భార్యను నేను ప్రేమిం చాను. కాని అప్పుడప్పుడూ నేను ఇతర అమ్మాయిలతో కూడా చిన్నసైజు ప్రణయకలాపాలు నడిపాను. వీటిలో చాలా సంఘటనలు ఆవిడకు తెలీదు. ఏవో కొన్ని విషయాలు ఆవి డకు తెలిసినా అంత పట్టించుకునేది కాదు. అసలు నా దృష్టిలో ఇవి అంత ముఖ్యమైన విషయాలు కానే కాదు. నామటుకు నాకు మాఆవిడే ముఖ్యం.'

అతను నావంక తిరిగి నా చేతులూ తన చేతుల్లోకి తీసుకుని ఇలా చెప్పసాగాడు. నేను అతని మాటలన్నిటిని శ్రద్ధగా వింటూ కూచున్నాను.

ఇరువురం విస్కీ తాగడం ముగించాం. తరువాత ఏదో పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ అలా షికార్లు చేశాం. లల్ నవ్వుతూ నాకు ఎన్నెన్నో కబుర్లు చెప్పసాగాడు. నేనూ నవ్వుతూ ఆ కబుర్లన్నీ విన్నాను. నవ్వు ఎవరికైనా ఎంతో ఆరోగ్యకరం. నవ్వూ ప్రేమా అక్క చెల్లెండ్రలాంటివి. నవ్వు లేనిదే ప్రేమ లేదు ప్రేమ లేనిదే నవ్వూ లేదు.

లల్‌తో కాలం గడిపిన తరువాత నేను మళ్లీ మరో బార్‌లోకి వెళ్లాను. మరో 400 ఫ్రాంకులు ఖర్చుచేసి విస్కీ సేవించాను. మనస్సుకెంతో హాయిగా ఉన్నది.

ఈసమయంలో ఎవరైనా నేస్తందొరికితే ఎంతబావుం టునా అనిపించింది. అతనితో నామనస్సులో ఉన్న విషయా లన్నీ చెప్పుకుని కొంత ఓదార్పుపొందవచ్చుగదా అనిపిం చింది. తరువాత మళ్ళీ మరో కిచ్చెన్‌కు వెళ్ళాను. అక్కడ హఠాత్తుగా బెర్‌ట్రాండ్ కనుపించాడు, ఒంటరిగా కూచుని ఉన్నాడు. నేను వెళ్ళి అతనిపక్కనే కూచున్నాను. బెర్ ట్రాండ్ నావంక చూచాడు. నారాక అతనికి ఆనందం కలి గించినట్లుగా అనిపించింది.

ఇప్పుడే నువ్వు జ్ఞాపకంవచ్చావు. 'కెంటకీ'లో కొత్త స్వరమేళం వచ్చింది. మనం వెడదామా? మనం ఇరువురం కలిసి డాన్సుచేసి ఎన్నిరోజులో కావస్తుంది' అన్నాడు బెర్ ట్రాండ్.

ప్రస్తుతం మనవద్ద ఒక్కపైసాకూడా లేదు?-అన్నాను.

మొన్నమనం వెళ్ళినప్పుడు నూఅమ్మ నాకు 10,000 ఫ్రాంకులు ఇచ్చింది. మరికొంచెం పానీయాలు పుచ్చుకుని వెడదాం?-అన్నాడు బెర్‌ట్రాండ్.

కాని ఇప్పుడు 8 గంటలే అవుతుంది. పదిగంటలకు కాని నృత్యమందిరం తెరవరు?-అన్నాను.

అయితే మరికొన్ని పానీయాలు పుచ్చుకుందాం'- అన్నాడు బెర్‌ట్రాండ్.

నామనస్సు రెపరెపలాడింది. బెర్‌ట్రాండ్‌తో వెళ్ళ వచ్చు, సుఖంగా డాన్సుచెయ్యవచ్చు. బెర్‌ట్రాండ్ ఈరోజు ఎంతో కులాసాగా ఉన్నాడు. త్రాగడం ప్రారంభించాం. విస్కీలన్నిటికి హాయిగా డబ్బువెదజల్లసాగాడు బెర్‌ట్రాండ్.

అయి దాసుసాన్లు తిరిగి హాయిగా పానీయాలు సేవించాం. పదిగంటలయ్యేసరికి నృత్యమందిరాన్ని చేరాం. అప్పుడే ఆర్కెస్ట్రా శ్రుతివేస్తూ ఉన్నారు. మేము నృత్యం చేయడానికి మాకోసం ప్రత్యేకంగా ఒకస్థలం ఖాళీగా ఉన్నది. నేనూ బెర్ట్రాండ్ ఆరాత్రి ఎంతోహాయిగా నృత్యంలో విలీనమైపోయాం.

ఆరాత్రంతా త్రాగుడూ, నృత్యం ఉన్మత్తమై రెండు స్వరాలు ఒకదానికి ఒకటి పెనవేసుకుని పోయినట్టు నేనూ బెర్ట్రాండ్ ఒకరికొకరం పెనవేసుకునిపోయాం! 4 గంటలు కావస్తూంది. మాబోర్డింగుహూసివేసి ఉంటుంది. బెర్ట్రాండ్ నన్ను తనలాడ్జికి రమ్మని ఆహ్వానించాడు. 'ఊ'-అన్నాను. అవును ఈరాత్రి బెర్ట్రాండ్ లాడ్జికి వెడతాను. అతని గదిలో మంచంమీద పడుకుంటాను. బెర్ట్రాండ్ తియ్యని భావాన్ని నాశరీరంపై భరిస్తాను.

# 8

తెల్లవారేవరకూ అతనిపక్కనే పడుకున్నాను. తెల్లవారింది. అతను ఇంకా నిద్రిస్తూనేఉన్నాడు. బహుశా ఏదో కలకంటూ ఉంటాడు. నామనస్సుకూడా ఎక్కడికో పరుగెత్తిపోయింది. ఈఇళ్ళుదాటి, ఊళ్లుదాటి, పొలాలు, నదులూ, చెట్లూ, పుట్టలూ గుట్టలూదాటి ఎక్కడికో పరుగెత్తిపోయింది. వెళ్ళివెళ్ళి ఒకతోటలోన చివర ఆగిపోయి నిర్మల ప్రతిమగా మారిపోయింది. ఈ శాశ్వతాత్మను ఇప్పుడు ఈ

నిద్రితునిపై వాలిఉన్న అమ్మాయి ఒక ప్రతిబింబంమాత్రమే ఏమో అనిపిస్తుంది. ఈఅమ్మాయికనుచూపులముందు ఎన్నో జీవన పథాలు తెరుచుకున్నాయి. కొన్ని పథాలను ఈ అమ్మాయి ఏరుకున్నది. మరికొన్ని పథాలనుతిరస్కరించింది. ఈపథాలు ఎగరలేని శిలాపక్షుల్లా గడ్డకట్టుకుని పోయాయి. ఒళ్ళు విరుచుకుని లేచాను. బట్టలు వేసుకున్నాను. బెర్ట్రాండ్ అప్పుడేనిద్రలేచాడు. కళ్ళుతెరిచాడు. 'గుడ్ మార్నింగ్'- అన్నాడు. ఆసాయంకాలంవచ్చి అతన్నికలుస్తానని చెప్పి నేను నాగదిలోకి వెళ్ళాను. చదువుకుందామనుకున్నాను. కాని చదువుకోలేకపోయాను. మధ్యాహ్నం ఎండ కసెక్కింది. మధ్యాహ్నం భోజనానికి లల్ ఇంటికి వస్తానని చెప్పాను. ఏమీతోచకుండావుంది. సిగరెట్లు కొనుక్కుందామని, బైటికివెళ్లాను. సిగరెట్లు కొనుక్కుని తిరిగివచ్చి మళ్లీ ఆలోచిస్తూ కూచున్నాను. ఏమీతోచడంలేదు. కటికిలో నుంచి ఆకాశంవంక చూస్తూకూచున్నాను.

జీవితంశూన్యంగా కనుపించసాగింది. జీవితంలో ఆలంబనమంటూ ఏదీకనుపించలేదు. ఎక్కడాఏమీలేదు. అంతా ఎడారి. తీరంలేని ప్రయాణం. దోవనవెళ్ళే పాన్థుని చిరునవ్వులోకాని, బస్ డ్రైవర్ ముఖంలోకాని, నగరవీథుల్లో ప్రవాహంలో తోసుకునివెడుతున్న జనసందోహంలో కాని ఎక్కడా ఏమీలేదు. అంతాశూన్యం. బెర్ట్రాండ్‌నుకూడా నేను ప్రేమించడంలేదు. నాకు, మరేదోకావాలి. నేను మరిదేన్నో వాంఛిస్తున్నాను. ఇలా భావించినప్పుడు నాలోఏదో ఉద్వేగంకలిగింది, నాసఖులు కాథరిన్ కూడా ఇలాంటి ఉద్వే

గాన్నే అనుభవించి ఆస్వాదించిన క్షణాలున్నాయి. ప్రేమ! తీయని ప్రేమ! నన్ను ప్రవాహంలా ముంచెత్తే ప్రేమ! కావాలి. నిజమే. కాని... కాని ఎంచేతనో కాని... నిన్న టినుంచి నేను ఎవరినీ ప్రేమించడంలేదా అనిపిస్తోంది. లల్ బహుశా నాకు దగ్గరవాడై ఉండవచ్చు. కాని నిన్నటి నుంచి అతన్నిగురించి తెలుసుకోడానికి కూడా సాహసించలేక పోతున్నాను. ఒకవిషయమైన అసహ్యంతోను మత్తుతోను పడకగదిలోకి పరుగుతీస్తూ వెళ్లాను. అద్దంలో ముఖాన్ని చూచుకున్నాను. ముఖం ఎంతో వాడిపోయినట్టుగా ఉంది.

పరీక్షలు వచ్చాయి. రాత్రిం బగళ్ళు చదివాను. ఏమైతేనేం కులాసాగా వెళ్ళి పరీక్షలకు వ్రాసివచ్చాను. ఒక రోజున లల్ ఫ్రాంకాస్ నన్ను చూచిపోవడానికి వచ్చాడు. పరీక్షలు ముగిసాయి. సెలవులిచ్చారు. నేను సెలవుల్లో మా ఊరు వెళ్ళాలి. లల్ వద్ద సెలవుపుచ్చుకున్నాను. లల్ సెలవుల్లో ఉత్తరాలు వ్రాస్తూఉంటానని మాటిచ్చాడు. సెలవులు మొదలెట్టాయి.

# ద్వితీయ భాగము

## 1

మా ఊరు మా ఇల్లు పెద్దది విశాలంగా ఉంటుంది. చుట్టూ పెద్ద మైదానం. పచ్చిక బయలు. పచ్చగా పట్టుతివాశీ పరిచినట్టుగా ఉంటుంది. దూరంగా యానీ నది కనుపిస్తూ ఉంది నదీతీరంలో చీర అంచులా ఉన్న నురగ, పిట్టలు కిలకిలా లాడుతూ ఆకాశంలో ఎగురుతున్నాయి.

మైదానంలో మర్రిచెట్లు చల్లని నీడలు, నీడల్లో పవళించడమంటే నాకెంతో ఇష్టం. తల చెట్టు మొదలకు ఆనించి పవళించాను. పైన నీలాల నింగి. పృథ్వి పచ్చని పచ్చికతో మిలమిలలాడుతూ చిత్రవిచిత్రమైన పరిమళాలను ప్రసరిస్తోంది. ఈ ప్రకృతి నాకు చిరపరచితురాలు. పారిస్ తో నాకు పరిచయం ఏర్పడక మునుపే ఈ విశాల ప్రకృతితో నాకు స్నేహ పరిచయాలు ఏర్పడ్డాయి. పారిస్ మారింది. సీన్ నదీతీరం మారింది పారిస్ లో మనుషులూ మారారు. కాని ఈ ప్రకృతి మటుకు అనాదినుంచీ ఇలాగే ఉంది. ఏదో దైవయోగం వల్లనే నేను పరీక్షల్లో గట్టెక్కాను. కాసేపు చెట్టుకింద పడుకుని ఏదో పుస్తకం పేజీలు తిరగవేశాను. తరువాత భోజనం చెయ్యడానికి ఇంట్లోకి వెళ్లాను. 15 సంవత్సరాల క్రితం మా ఇంట్లో ఒక విషాదసంఘటన జరిగింది. నా చిన్న తమ్ముడు చనిపోయాడు. ఆనాటినుంచి మా అమ్మ ఆ విషయాన్ని మరచిపోలేకుండా ఉన్నది. ఈనాటికీ ఆ విషాదం మా ఇంట్లో చీకటి తెరల్లాగ వ్రేలాడుతూనే ఉన్నది.

బెర్ట్రాండ్ నాకో ఉత్తరం వ్రాశాడు. ఉత్తరంలో
పెద్ద విశేషాలేమీ లేవు. కెంటకీలో మేము గడిపిన రాత్రిని
గురించే ముఖ్యంగా వ్రాశాడు. లల్ దగ్గరనుంచి వార్త
లేమీ లేవు. ఫ్రాంకాస్ మటుకు క్షేమసమాచారాలకు విచా
రిస్తూ ఒక ఉత్తరం వ్రాసింది. ఆ ఉత్తరంలో ఆవిడ సంతకం
క్రిందనే లల్ కూడా సంతకం చేశాడు. లల్‌ను నేను విడిచివచ్చి
చాలా కాలం కావస్తుంది. కాని అందువల్ల నేను ఏక్షణంలో
కాని విరహబాధను అనుభవించలేదు. అంచేత నేను లల్‌ను
ప్రేమించడం లేదేమో అనుకున్నాను- ఒకవిధమైన గర్వంతో
మాడూరంటే నాకెంతో ఇష్టం. ఈ ఇల్లు నాకెంతో బావుంది.
పల్లెపట్టున ఈ జీవితం నాకు కొంచెం విసుకెత్తిస్తున్నమాట
వాస్తవమే. కాని ఈ నిరామయత్వంలోనే ఒకవిధమైన
ఆనందం కనుపిస్తూ ఉన్నది. ఇక్కడ ఉన్న ఇరుగుపొరుగుతో
నేస్తం కలిసింది, హాయిగా కాలం జరిగిపోతూంది. రేపటి
సంగతి ఏమిటా అని ఆలోచనే లేదు, సెలవులు ముగిసేవరకూ
ఇలాగే కాలం దొర్లిపోతుంది. చివరకు ఎలాగవుతేనేం లల్
దగ్గరనుంచి ఓ ఉత్తరం వచ్చింది, సెప్టెంబర్ 2 వ తారీకున
అవినాన్‌లో ఉంటానని నాకోసం ఎదురుచూస్తూ ఉంటా
నని వ్రాశాడు. వెంటనే నేను అక్కడికి వెళ్లాలని నిశ్చయించు
కున్నాను. ఉత్తరంలో పెద్ద విశేషాలేమీ లేవు. లల్ మామూ
లుగా వ్రాసే ధోరణిలోనే ఉత్తరం నడిచింది. సెప్టెంబరు 1 వ
తారీఖున బయలుదేరి అవినాన్ వెళ్లాను. మా నాన్నా
అమ్మా వచ్చి నన్ను స్టేషన్ దగ్గర వదిలారు. నేను 'వెళ్ళి

వస్తాను'- అంటూ సెలవుతీసుకున్నప్పుడు మాఅమ్మకళ్ళలో నీళ్ళుతిరిగాయి. నాబాల్యాన్ని, నాఇంటిని విడిచి దూరంగా వెళ్ళడం ఇదే తొలిసారి. ఏమోననిపించింది.

♦ ♦ ♦ ♦

లల్ వద్దనుంచి ఉత్తరంవచ్చిన తరువాత అతన్ని గురించి ఒక విధమైన అనాసక్తమైన అభిప్రాయాన్ని ఏర్పరుచుకుని నేను అవినాన్‌లో దిగాను. నేను లల్‌ను ప్రేమించానుకాబట్టి అతన్ని కలుసుకోడానికి వెళ్ళడంలేదు. ఇరువురం ఒకేభాష మాట్లాడుతాం కాబట్టి ఇరువురి మధ్య ఒక విధమైన ఆకర్షణ ఏర్పడిందికాబట్టి లల్‌ను కలుసుకోడానికి వెళుతున్నాను.

కాని తీరాస్టేషన్ చేరేసరికి లల్ మళ్ళీనన్ను ఆశ్చర్యంలో ముంచెత్తాడు. నాకోసం ప్లాటుఫారంమీద కాచుకుని ఉన్నాడు లల్. నన్నుచూడగానే అతనిముఖం ఆనందంతో వికసించింది. నేను రైలుపెట్టెదిగిన వెంటనే అతను పరుగు తీస్తూవచ్చి నన్ను కౌగిలించుకున్నాడు.

ఎంచక్కా ఉన్నావు! నీవు వచ్చినందుకు నేనెంతో సంతోషిస్తున్నాను'-అన్నాడు లల్.

నీవు ఎంతచక్కగా తయారయ్యావు'-అన్నాను అతని ముఖాన్ని ఒకసారి పరికించిచూచి. నిజంగానే లల్ పూర్వంకంటె ఎంతో బావున్నాడు

మనం అవినాన్‌లో ఉండడం ఎందుకు? ఒకమారు సముద్రతీరానికి వెడదాం అన్నాడు లల్. అతనికారు స్టేషన్

దగ్గరే ఆగిఉన్నది. లల్ నా కంచీని కారు వెనకసీట్లో పడేశాడు, నేను కారుముందుసీట్లో కూచున్నాను. కారు బయలుదేరింది అతను నన్నిలా ఆప్యాయంగా ఆహ్వానించడం నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. అతనింత కులాసాగాను హుషారుగాను ఉంటాడని నేను ఊహించలేను. రోడ్డు చక్కగా ఎంతో అందంగా ఉన్నది.

ఇరువంకలా చెట్లు, కారు సాఫీగా సాగిపోతూఉన్నవి. లల్ సిగరెట్ కాలుస్తూ కారునడుపుతున్నాడు. నేను అతన్ని సిగరెట్ ఇవ్వమని అడిగాను. లల్ చిరునవ్వు నవ్వాడు.

కులాసాగా ఉందికాదూ? అన్నాను.

చిరునవ్వు నవ్వాను. లల్ కారునుఆపి నన్ను చేతుల్లోకి తీసుకుని ముద్దాడాడు. నేను పల్చగనవ్వాక మళ్ళీ కారు బయలుదేరింది. సముద్రతీరంలో కారునిలిచింది. సముద్రం అద్భుతంగా ఉన్నది. సముద్రం ఇంతఅద్భుతంగా ఉంటుందని నేను ఇంతకుముందెన్నడూ ఊహించలేను. ఫ్రాంకాస్ కూడా ఇప్పుడు నాతో ఇక్కడేఉంటే ఎంతబావుంటునా అనిపించింది. నాకు సముద్రతీరంలో కూచునప్పుడు ఎన్నెన్నో ఆలోచనలు సముద్రతరంగాలవలెనే నామనస్సులో చెలరేగ సాగాయి. ఎంతోసేపు సముద్రం ఒడ్డునకూచుని మళ్ళీ ఇంటికి బయలుదేరాము. మేము దూరంవెళ్ళి కొద్దినీలంగా ఉన్న సముద్రం పాలిపోసాగింది.

క్రోసెటికి వెళ్ళేతోవలో కానెస్ వద్ద లల్ ఒక పెద్ద హోటల్ ముందు కారును ఆపుచేశాడు. ఆహోటల్ ఎంతో

పెద్దది. ఆహోటల్‌ను చూసేసరికే నాకుభయంవేసింది. లల్ సరాసరి హోటల్లోకి వెళ్ళాడు. యునిఫర్మ్ గంభీరంగా కనుపించే ఒకవ్యక్తి డెస్కుదగ్గరకూచుని ఉన్నాడు. ఆవ్యక్తిని చూచినప్పుడు నాకు భూమిలోకి దిగిపోతున్నా నేమోననిపించింది. తరువాత మాకొకగది చూపించారు. గదిపెద్దదిగా విశాలంగావుంది. రెండుకిటికీలు. గదిలో అడుగుపెట్టగానే లల్ ఒకసారిగదినంతా కలయచూచాడు. నేను అదోలా ఉన్నాను. లల్ నావంక చూచి, 'అదుగో' మళ్ళీ దిగులుగా కనుపిస్తున్నావు. వెళ్ళిస్నానంచేసిరా. దిగుళ్ళన్నీ పోతాయి' అన్నాడు. లల్ చెప్పినమాటలో నిజంలేకపోలేదు. స్నానం చేసి వచ్చాను. స్నానంచేసిన తరువాత నాకెంతో హాయిగా అనిపించింది. బాల్కనీ దగ్గర లల్ ప్రక్కనే నిల్చుని విస్కీ సేవిస్తూ ఎన్నెన్నో కబుర్లు చెప్పసాగాడు. తరువాత ఇద్దరం కలిసి భోజనానికివెళ్ళాం. భోజనం ముందు ఇరువురం ఫ్రాంకాస్‌ను గురించి బెర్ట్రాండ్‌ను గురించి మాట్లాడుకున్నాం.

## 2

మరోవ్యక్తితో కలిసి నివసించడమనేది చాలాక్లిష్టమైన విషయమని ఎందరోచెప్పగా నేను విన్నాను. సిద్ధాంతంగా చెప్పడానికి. ఈమాట బాగానేఉన్నదికాని ఆచరణలో మటుకు ఇదినిజంకాదని లల్‌తో నేను గడిపిన కొద్దిరోజుల అనుభవంలోను తేలింది. అతనితో కలిసి ఉన్నంతకాలం నాకు తీరికచిక్కుందుకునే అవకాశం లేనందువల్ల ఈ మాట

నిజమని అంటున్నాను. అలాత్రీక చిక్కుచుకుంటే అతను విసిగిపోతాడేమోనని నా భయం. ఇతరులు నన్ను విసుకెత్తించినా నేను భరించగల నేమోకాని, మగాడు నావల్ల విసుకెత్తితే మాత్రం నేను భరించలేను. అయినా లల్‌తో కలిసి నివసించడమనేది పెద్దకష్టమైన విషయం కాదు. లల్ మనల్ని ప్రశ్నలతో ముంచెత్తాడు. ఎప్పుడూ కులాసాగా హాయిగా ఉంటాడు. అలాంటి లల్‌తో కలిసి కాలక్షేపం చెయ్యడం ఒక పండగవంటిదే అవుతుంది. కాని నాకే నలిగిస్తుందని ఎలా అనుకోడం?

ఇంతేకాదు. మా ఇద్దరిమధ్య ఎన్నో సామ్యాలున్నాయి. నడకలో, మాటలో, అలవాట్లలో మా ఇద్దరిపద్ధతులూ ఒకేరకంగా కనుపిస్తాయి. మాశరీరాలుకూడా పరస్పరం అతికినట్టుగా సరిపోయాయి. ఇరువురం ప్రేమికులం. అంతేకాదు. స్నేహితులం కూడా. ఇరువురం కలిసి మెలసి టెరేనియల్ సాగరనీలజలాల్లో ఈదులాడాం. ఇరువురం కలిసి విందులను ఆరగించాం. ఎన్నోకబుర్లు ఒకరిచెవుల్లో ఒకరం ఊదుకున్నాం.

ఒక్కొక్కసారి రతి క్రీడ ముగిసినపిదప లాలింపులతో హాయిహాయిగా తీయతీయగా నేను లల్ కౌగిలిలో సొమ్మసిల్లినప్పుడు 'లల్' నన్ను ప్రేమించవూ! నన్ను ప్రేమించు. ప్రేమించడానికి మనం యత్నిద్దాం'- అని లల్‌ను బ్రతిమాలాలనిపించింది. కాని నేనెన్నడూ అలాంటి మాటలను అనేదాన్ని కాదు.

అతని నొసటిని, కళ్ళను, చెక్కిళ్ళను తనివితీర ముద్దాడి అంతటితో సంతృప్తిపడక ఊపుకుపేదాన్ని. ఇంతచక్కని ముఖాన్ని నేను ఇదివరకు ఎన్నడూ ప్రేమించిఉండలేదు. చివరకు అతని చెక్కిళ్ళనుకూడా నేను ప్రేమించాను. చెక్కిళ్ళు చిరుమన్నుల్లా కనిపించేవి. అతని చల్లని చెక్కిళ్ళకు నాముఖాన్ని ఆనించి గట్టిగా ఒత్తుకున్నాను. చిరుగడ్డం అప్పుడప్పుడే మొలుస్తున్న గడ్డాన్ని గట్టిగా చెక్కిలికి ఒత్తుకుంటే అబ్బ! ఎంతో తమాషాగా ఉంటుంది!

ఇప్పుడునాకు అర్థమైంది. ప్రౌస్ట్ ఆల్బర్టైన్ చెక్కిళ్ళను గురించి అంత పెద్దసత్యం ఎందుకని వ్రాశాడో లల్ కూడా నాశరీర సౌందర్యాన్ని గురించి ఎన్నో విషయాలు చెప్పే వాడు. నాఒళ్ళు పులకరిత్తేది. ఒక వజ్రం యొక్క నాణ్యాన్ని గురించి చర్చిస్తున్నట్లుగా నాశరీరాన్ని గురించి చర్చించే వాడు అయినప్పటికీ మా సంభాషణలలో ముఖ్యమైంది కామం కాదు. అంతకన్న అతీతమైనది మరేదో మా సంభాషణలలో కనుపించేది. భోజనం ముగించి నేనూ లల్ తిరిగి బార్‌కు వెళ్ళాం.

ఏకాంతమూ, సాయంత్రమూ-అనే రికార్డు వేయమని అడిగాడు లల్.

'ఈపాటంటే నీకెంతో ఇష్టంకదూ!'-అని అడిగాడు లల్.

'ఎలా కనిపెట్టగలిగావు?'-అని ప్రశ్నించాను.

'ఈపాటవింటూవుంటే నీకు బెర్ట్రాండ్ జ్ఞాపకం వస్తాడుకదూ!'- అన్నాడు లల్.

అవునన్నాను.

నాకళ్ళలో ఎందుచేతనో కాని నీళ్ళు తిరిగాయి. లల్ చేబురుమాలతో నాకన్నీరు తుడిచి నన్ను కౌగిట్లోకి తీసుకున్నాడు.

'రా. నృత్యంచేదాం'-అన్నాడు.

బెర్ట్రాంక్‌కు ఎంతో ప్రీతికరమైన ఆపాట వినిపిస్తూ ఉండగా మేమిద్దరం కలసి నృత్యం చేయసాగాం. మేము నృత్యంచేస్తూఉండగా లల్ హఠాత్తుగా నన్నుగట్టిగా కౌగిలించుకున్నాడు.

* * * *

ఆవారం గడిచిపోయింది. నృత్యాలు, ప్రణయరహస్యాలు, గుసగుసలు, సముద్రతీరాన షికార్లు, ఇలా ఆవారం స్వప్నంలా గడిచిపోయింది. మేము ఎంతో అలసిపోతూ రాత్రులు నిద్రలేనందువల్ల మాముఖాలకాంతి హీనంగా కనుపిస్తున్నాయి.

ఇక మేము ఆహోటల్ నుంచి ప్రయాణం కట్టవలసిన ఉదయంవచ్చింది? ఆ ఉదయం ఎంచాతనోకాని లల్ నన్ను ప్రేమిస్తున్నాడా అనిపించింది నాకు. అయినా నాలో ఏదో ఒక అవ్యక్తమైన దిగులు పొగతీగలా సాగింది?

'ఫ్రాంక్ నీకోసం ఎదురుచూస్తూ ఉంటుందను కుంటాను'-అన్నాను.

'ఆవిషయం ఏదో ఒకవిధంగా సర్దుబాటు చేసుకోన వచ్చు' కాని నిన్నుకాని కానెస్ నుకాని నేను వదలి వెళ్ళ దలుచుకోలేదు'- అన్నాడు లల్.

'అవును నాకూ అలానే అనిపిస్తున్నది'-అన్నాను.

అదే గొంతెక లల్ గొంతుకే నా గొంతుకలో ప్రతి ధ్వనిస్తున్నదా అనిపించింది.

మరోసారి లల్ నన్ను ప్రేమిస్తున్నాడనేభావం నాలో తళుక్కున మెరుపుతీగెలా మెరిసింది.

* * * *

హోటల్ ముందు కూచునిఉన్నాను. నాలో ఒకవిధ మైన సంతృప్తి. దూరంగా నీలంగా సముద్రం కనిపిస్తూ ఉన్నది. అక్కడక్కడ ఎదురుఎదురుగా కొందరు ఆంగ్లేయ స్త్రీలు కూచునివున్నారు. లల్ ఏదోపని చూసుకుని రావ డానికి ఊళ్ళోకివెళ్ళాడు. నన్నుకూడా తనతో రమ్మన్నాడు. కాని నాకు ఒంటిగావుండాలని అనిపించి. ఇక్కడే కూచు న్నాను. ఒంటిరిగాకూర్చున్నాను. అలసటగా ఉంది. ఆవు లింతలు, తలతిరిగిపోతూంది. సిగరెట్ వెలిగించడానికికూడా ఓపికలేదు. బద్ధకం. వేళ్ళుఒణుకుతున్నాయి. లేతఎండ నా చెక్కిలిపైపడి మిలమిల లాడుతూవున్నది. నాలో మెల్ల మెల్లగా ఏదోఅంత శ్శాంతి నిండుతున్నది. 'ఒక్కొకసారి అలసిపోయినప్పుడు మనకు ఎంతోసుఖంగా ఉంటుంది!- అన్నాడు లల్ ఒకసారి. ఈమాటనిజమేనని ఇప్పుడునాకు తోచింది ఒకెక్కడాడు నాఎక్కసుంచే నన్నుచూస్తూ

వెళ్ళాడు. ఎంతో అందంగా ఉన్నాడు కుర్రాడు. ఆ కుర్రాడి వంకచూచీ చూడనట్టుగా చూశాను.

హఠాత్తుగా నాకూ సముద్రానికి మధ్య పొగమంచు కమ్ముకొచ్చింది. నానుదిటినుంచి చెమట ధారలుగా కారుతూంది. ఏదో భయం బహుశా మృత్యువంటే ఇలాగే ఉంటుందాఏమిటా అనిపించింది. మృత్యువు చాలా విచిత్రమైనది. మృత్యువు మన సమీపానికి వచ్చిందని అనుకున్నప్పుడు మనకు మనజీవితంలోని ఎన్నెన్నో తీయని విషయాలు జ్ఞాపకానికి వస్తాయి. అలాగే ఈక్షణంలో. నాకు పారిస్, పుస్తకాలు, కొన్ని సెంటుపరిమళాలు, రవి, మరెన్నో విషయాలు జ్ఞాపకానికి వచ్చాయి. లల్‌కు నాకు ఒక దైవనిర్మితమైన అవినాభావ సంబంధం ఉన్నట్టుగా అనిపించింది. మమ్మల్నిద్దరినీ ఈశ్వరుడు ఒకరికోసం ఒకరిని సృష్టించాడా అనిపించింది. కాని విధాత ఈఒక్క విషయాన్ని మటుకే మా నొసట వ్రాసి ఊరుకోలేదు. లల్ నన్ను వదలి వేయాలని, ఆ తరువాత నేనుమళ్ళీ కొత్తగా ఒక నూతన ప్రణయాంకం ప్రారంభించాలని కూడా విధాత లిఖించాడు. మూడునిమిషాలు ఇలా ఆలోచనలతో గడిచాయి. దూరంగా కూచుని ఉన్న ఒక ఆంగ్లేయ స్త్రీ నావంక తేరిపారచూచింది. ఆవిడ నావంక అలా తదేకంగా చూచినప్పుడు నాకు ఎంచేతనో కాని సిగ్గుకలిగింది. నేనూ ఆవిడవంక తిరిగిచూశాను. ఒక భాష తెలియని ఇరువురు వ్యక్తులు ఒకరివంక ఒకరు అలా తేరి పారచూచుకోడం ఎంతో విచిత్రంగా కనుపించింది. ఆసంపమనే దానికి చరిత్రంటూ ఉండదు. అందుచేత కానేస

మేము గడిపిన ఈకొద్దిరోజులూ నామనస్సులో స్థిరమైన ముద్రను దేన్నీ నిలిపివెళ్లలేదు. కొన్ని విషాద పూరితాలైన క్షణాలు, లల్ నవ్వు, వేసవి పరిమళం- తప్పమరేం జ్ఞాపకం లేదు. ఒకనాటిఉదయం నాకు బాగా జ్ఞాపకం. సముద్రం ఒడ్డున లల్ తీరంలో కూచుని ఉన్నాడు. నేనుసముద్రంలో ఈతకొట్టడానికి బల్లచెక్కను ఎక్కాను, సముద్రంలో దూరంలో యేసమయంలో నేను లల్ వంకచూచాను. అమ్మయ్యో! అన్నట్టుగా లల్ నావంకచూచాడు. నేను సముద్రంలో ఈది, ఒడ్డుకువచ్చి అలసిపోయి లల్ ఒళ్ళోవాలిపోయాను.

'ఏమిటి? వెర్రెత్తిందా? ఎంతసాహసం చేశావు?'- అన్నాడు లల్.

'అవున'న్నాను. ఈసంఘటన నాకు బాగా జ్ఞాపకం. తరువాత చాలాసేపు సముద్రం ఒడ్డునే నిద్రపోయాను. నిద్ర లేచి చూచేసరికి బాగా పొద్దుగూకింది. బీచి ఖాళీగాఉన్నది. నాకు బాగా దాహంవేస్తున్నది. లల్ సిగరెట్ కాలుస్తూ నాపక్కనే కూచుని ఉన్నాడు. సముద్రంవంక తదేకంగా చూస్తూఉన్నాడు. నేను నిద్రలేచానన్న స్మృతికూడా లేకుండా. నేను అలాగే సముద్రంఒడ్డున కాసేపుపడుకున్నాను.

'పక్కనే ఒక స్త్రీ నిద్రపోతుంది. ఆవిడ పక్కన ఒక వ్యక్తి కూచుని ఏదో ఆలోచిస్తూఉన్నాడు. బహుశా ఇతను ఏవిషయాన్ని గురించి ఆలోచిస్తూ ఉండవచ్చు'-అని తలంపోయసాగాను.

'నిద్రలేచావా?'-అని అడిగాడు లల్.

'ఊ'-అన్నాను.

'చాలాసేపు నిద్రించావు'- అన్నాడు లల్.

*  *  *  *  *

మేము ఇక్కడినుంచి ఇంటికి వెళ్ళవలసినరోజువచ్చింది. కాని ఈ విషయాన్ని మేము ఒకరి నొకరం చెప్పుకోలేదు. ఎంచాతనో-కాని ఈవిషయాన్ని ఒకరికి ఒకరం చెప్పుకోవా లంటే నాకేభయం వేసింది. ఇరువురిలోనూ దాగిఉన్న ఉద్వేగాలు హఠాత్తుగా బైటపడిపోతాయేమోనని భయం. ఆ రాత్రంతా నాకు సరిగా నిద్రపట్టలేదు. ఒకవిధమైన భయం ఎన్నోసార్లు నిద్రమధ్యలో లేచి పక్కన లల్ ఉన్నాడా? లేడా? అని వెదకి చూచాను.

మా తిరుగుడు ప్రయాణం సుఖంగానే సాగింది. కొంతదూరం నేను కారునడిపాను. మరికొంతదూరం లల్ కారునడిపాడు. ఆరాత్రే మేము పారిస్ చేరుకోగలమని చెబుతూ మరుసటిరోజు నన్ను విందుకు రమ్మని ఆహ్వానించాడు లల్. ఫ్రాంకాస్ కూడా ఈ రెండు వారాలలోనే పుట్టింటికి వెళ్ళింది. మేము పారిస్ చేరుకునేసరికి ఫ్రాంకాస్ వచ్చి ఉంటుంది.

ఇదంతా నాకు కలవరింతలతో కూడిన కలలాగ కనుపిస్తూవున్నది. మేము పారిస్ చేరుకునేసరికి రాత్రిబాగా ప్రొద్దెక్కింది. లల్ ముఖంవంక చూచాను. లల్ ముఖం బాగా వాడిపోయి ఉన్నది. ప్రయాణంబడలిక కనుపిస్తూంది. హఠాత్తుగా నాలో నాలో ఏదో లోపం రాజుకుంది.

7)

# తృతీయభాగము

## 1

పారిస్ నాకు అపరిచితమైన పట్నం కాదు. పారిస్‌లో నేను ఇప్పుడు కొత్తగా స్నేహం కలుపుకోవలసిన అవసరం లేదు. కాని పారిస్ నగరంలో నాకు ఇదివరకే పరిచయం ఉన్నప్పటికీ ఇప్పుడు మళ్ళీ పారిస్ నాకు కొత్తనగరంలా కనుపించింది. పారిస్ నగర వీధుల్లో నేను నడుస్తూ ఉన్నప్పుడు, అడుగడుగునా కొత్త కొత్త అందాలు చిందుతూ కనుపించాయి. మూడు రోజులు మళ్ళీ నగరాన్ని మూలమూలలా కలయచూడడంతోటే సరిపోయింది. లల్‌తో గడిపిన ప్రణయానుభవాన్ని కూడా విస్మరించాను. రాత్రి లల్ జ్ఞాపకం వచ్చేవాడు. లల్ ప్రక్కనే ఉన్నాడేమో అని వెదికేదాన్ని. లల్ ప్రక్కన లేకపోవడం ఎంతో అసహజంగాను అసందర్భంగాను తోచేది. అయినా మేము గడిపిన రెండు వారాల అనుభవం నా మనస్సులో ఇప్పటికిప్పుడే రూపురేఖలు ఏర్పరచుకొంటూ ఉన్నది. అదేం చిత్రమో కాని నా మనస్సులో వైఫల్యానికి చోటుగా ఆశ చిగురులెత్తింది. బెర్ట్రాండు త్వరలోనే పారిస్ వస్తాడని విన్నాను. అతన్ని కలుసుకోవాలి. కలుసుకుంటే అతనితో ఏం మాట్లాడాలనే సమస్య నన్ను ఎదుర్కొన్నది. బెర్ట్రాండు నన్ను మళ్ళీ తన కౌగిల్లోకి తీసుకోవడానికి యత్నిస్తాడు. ఆ విషయం నాకు తెలుసు. కాని ఎలా భరించడం? లల్ శరీరంలో పెనవేసుకుని పోయిన నా శరీరాన్ని బెర్ట్రాండుకు అప్పగించడం ఎలా? లల్ దగ్గర

నుంచి కబురేమీ రాలేదు. ఆమరుసటి రోజుకూడా లల్ దగ్గరనుంచి కబురువస్తుందని వేచిఉన్నాను. కాని లల్ దగ్గరనుంచి కబురేమీరాలేదు. బహుశా ఫ్రాంకాస్ ఏదో పేచీపెట్టి ఉంటుందని అనుకున్నాను. ఈమాట స్ఫురించినప్పుడు నాకెంతో సిగ్గుకలిగింది. నేనువట్టిఅశక్తురాలనేమో అనిపించింది. వచ్చే ఏడాది ఏం చదవాలో ఆలోచిస్తూ కాసేపు అటూఇటూ పచార్లుచేశాను. ముందు 'లా' చదువుదామనుకున్నాను. కానీ 'లా' కంటే కూడా నా ప్రవృత్తికిఎక్కువదగ్గరైన విషయాన్ని చదవాలని అనుకున్నాను. లల్, నన్ను తనస్నేహితుడైన ఒకవార్త పత్రికసంపాదకునికి పరిచయం చేస్తానని వాగ్దానంచేశాడు.

రెండు రోజులుగడిచాయి. లల్ దగ్గరనుంచి కబురు లేదు. అతన్నిచూడకుండా ఉండలేకపోయాను. అతన్నిచూడాలనికోరుతూ ఒకచీటీ వ్రాసి పంపాను. లల్ మరుసటిరోజునవచ్చి నన్ను కలుసుకున్నాడు. ఫ్రాంకాస్‌ను తీసుకురావడానికి ఆవిడపుట్టినింటికి వెళ్ళాడట. అందుచేత నన్ను కలుసుకోలేకపోయానన్నాడు లల్. అతని కంఠస్వరంలో ఏదోమార్పుకనుపిస్తూఉంది. అతనికంఠస్వరం పూర్వంలాగలేదు. అతను మాట్లాడుతూ ఉన్నప్పుడు నేను ఇలా ఊహించసాగాను. మేము ఇరువురం తిరిగి ఏహోటల్లో కలుసుకుంటాం. లల్ నన్ను తనకౌగిట్లోకి తీసుకుంటాడు. కలుసుకోడానికి రెండు రోజులు ఆలస్యమైనందుకు నన్ను క్షమించమని అడుగుతాడు. కాని అలాంటిదేమీ జరగలేదు. ఇరువురం హోటల్లో కలుసు

కునాౖం. అంతే లల్ నన్ను క్షమించమని కోరలేదు. ఫ్రాంకాన్ కులాసాగా ఉన్నదని చెప్పాడు అంతే.

'నువ్వుచాలా చక్కనిపిల్లవి'- అంటూ నాఅరచేతిని ముద్దాడాడు. లల్‌లో నాకు చాలామార్పు కనుపించింది. లల్ నాకు దూరమైపోతున్నాడా అనిపించింది. అతనూ నేనూ ఎంతోసేపు మాట్లాడుకున్నాం. కాని ఆమాటలు కాగితపుపూలు. లల్ 'ఇహ వెడతా' నన్నాడు. నాకెంతో కోపంవచ్చింది.

'నన్నుఒంటిగా వదిలివెడతావా!' -అని ముఖాన్నే అడగాలనిపించింది.

రెండుమూడురోజులు ఎలాగో ఒకలా గడిచాయి. చూసిన సినిమా చూడకుండా చూశాను. నేను నివసిస్తున్నగదే నాకు కొత్తగా కనుపించింది. చక్కగా ముస్తాబుచేసుకుని లల్‌ను చూదామని బయలుదేరాను. లల్ ఇంటికి చేరేసరికి ఎంచాతనో కాని భయంవేసింది. బెల్ మ్రోగించాను. ఫ్రాంకాస్ వచ్చి తలుపు తెరిచింది. అవిడ చల్లని చిరునవ్వు నన్ను కొంచెం ఓదార్చింది.

ఫ్రాంకాస్ చాల విచిత్రమయిన మనిషి. నిండుకుండ లాంటిది. ఆవిడ భర్త ఆవిడకు అన్యాయము చేసాడనే విషయము ఆవిడను యెప్పుడు కలవర పరచలేదు. ముగ్గురంకలసి భోజనానికి కూర్చున్నాము. లల్ మధ్యమధ్యలో యేవేవో కబుర్లు చెప్పసాగాడు. తరువాత సంభాషణ బెర్ట్రాండు మీాదికి మరలింది.' అతను వచ్చేసరికి నేను ఈడొళ్ళవుండ నేమో అన్నాను. ఎక్కడికివెళతావేంటి అని అడిగాడు లల్.

కొన్నాళ్లు మామయ్యగారింటికి వెళ్ళి, కొన్నాళ్ళు అక్కడ వుండాలని అనుకుంటున్నాను. 'మళ్ళీ యెప్పుడు వస్తావేమిటి' అని ఫ్రాంకాస్ అడిగింది. రెండు వారాల్లో తిరిగివస్తానన్నాను.' ఆవిడనావంక చూసింది. నేను ఆవిడవంక చూశాను. లూక్ గ్రామఫోను తెసికొని రావడానికి వెళ్ళాడు. ఫ్రాంకాస్ నా భుజము మీద చేయివేసి 'నీవు వూరికి వెళ్ళిన తరువాత ఒక వుత్తరమును వ్రాస్తావు కదూ' అన్నది. లూక్ రికార్డు వేశాడు. ఈపాటంటే నాకెంతో యిష్టం అని అన్నాడు. ఆరోజు ఆదంపతులకు ఒక నాటకశాలనుండి ఆహ్వానము వచ్చింది. ఫ్రాంకాస్ వారితో నన్నుకూడా రమ్మని ఆహ్వానించింది. నన్ను తనగదిలోనికి తీసికొనిపోయి తనకోటు నాకు తొడిగింది. 'ఈకోటు నీకు పెద్దదయినట్టుగావుండదే అమ్మాయి అంది' ఫ్రాంకాస్. ముగ్గురం కలిసి నాటకశాలకు వెళ్ళాం. నాటకశాలలో వున్న పెద్దల నందరిని చూపుతూ వారి వివరాలన్నీ చెప్పింది నాకు ఫ్రాంకాస్. నాటకమునుండి తిరిగివచ్చిన తర్వాత నాగదికి వెళ్ళాను. ఆమరుసటి రోజు ఉదయాన్నే మామయ్యగారింటికి ప్రయాణం కట్టాను.

## 2

యానే నది త్రిభంగిగా దూరంగా వెండి తీగలాగ కనిపిస్తూ ఉంది. మూడువారాలు ఉండలేక పోయాను. కాలంబరువుగా కనుపించింది. ఒక్క వారంలోనే తిరిగి పారిస్ వచ్చాను. నేను పారిస్ వస్తూంటే మాఅమ్మ హఠాత్తుగా నాదగ్గరికి వచ్చి 'ఏమే అమ్మాయ్, మనస్సు బాగాలేదా?' అని ప్రశ్నించింది. 'ఏంలేదమ్మా బాగానే ఉన్నాను'- అని ఆవిడకు నచ్చచెప్పాను.

నేను పారిస్‌లో నా బోర్డింగ్ హౌస్‌ను చేరుకునేసరికి

నాగదిలో ఒక చీటీ కనుపించింది. బెర్ట్రాండు వ్రాసిన చీటిఅది. సాయంకాలం ఆరుగంటలకు బెర్ట్రాండును కలుసుకున్నాను. 'ఎంతో చక్కగా తయారయ్యావు సుమా'- అన్నాడు బెర్ట్రాండు నన్ను చూడగానే నేను చిరునవ్వు నవ్వాను. బెర్ట్రాండు ఇప్పుడు గంభీరంగా కనుపిస్తూ ఉన్నాడు. కాని ఇప్పుడు నాకు బెర్ట్రాండుతో అవసరం ఏమిటి? నామనస్సు సంతోషాలకు ఆరగొన్నాను. 'అనాన్మయ్ నువ్వు లలిన్ను ప్రేమిస్తున్నావు కదూ!'-అన్నాడు బెర్ట్రాండు నాకు చిరాకెత్తింది. 'ప్రేమఅనే ప్రస్తావన తేనేలేదు. మేము ఇంతవరకు ఒకరిని ఒకరం అర్థంచేసుకున్నాం. అంతే' అన్నాను. 'అనాన్మయ్ నన్ను నమ్మవూ! ఏదిఏమైనా నేను నిన్నే ప్రేమిస్తాను'- అన్నాడు. నాకు జాలివేసింది. కన్నీళ్ళు తిరిగాయి. 'వస్తాను బెర్ట్రాండు'- అంటూ సెలవుతీసుకొని వెళ్ళిపోయాను.

* * *

కాథరిన్‌ను చూడాలని వెళ్ళాను. నేను వెళ్ళేసరికి కాథరిన్ తనగదిలో మంచంమీద కూచునిఉంది. నన్ను చూడగానే వాకిటిదాకావచ్చి నన్ను ఆహ్వానించి లోనికి తీసికొనివెళ్ళింది.

'అనాన్మయ్, నన్ను క్షమించు బెర్ట్రాండుతో నేను ఏవిషయమూ చెప్పకుండాఉండి ఉండవలసింది'-అన్నది.

'చెబితే వచ్చిన ప్రమాదంలేదు'-అన్నాను. కాథరిన్ చిరునవ్వునవ్వింది.

'అసలుకథేమిటి? చెప్పవూ!'-అన్నది.

'ఏముందికథ? ఏమీలేదు. రెండువారాలపాటురిలేశా లో నాకునచ్చినఒకవ్యక్తితో కాలంగడిపాను. అంతే'అన్నాను.

'అతనుపెళ్ళయినవ్యక్తికదూ!'-అన్నది కాథరిన్ పెద్ద తెలివితేటలను ప్రదర్శిస్తూ ఉన్నట్టు.

'ఊహూ. వట్టిచెవిటి మొద్దు'- అన్నాను వెక్కిరింతగా.

'అమ్మాయ్-నీమనస్సు మనస్సులో ఉన్నట్టుగా లేదు. సాయంకాలం నాతోరా. అలా ఎక్కడికైనా హోటల్‌కు వెళ్ళి కాలక్షేపం చేద్దాం! సాహిత్యమంటే ఎంతో అభిమానం ఉన్న ఒక స్నేహితుణ్ణి నీకు పరిచయం చేస్తాను'- అన్నది కాథరిన్.

*　　*　　*

ఆమునసటిరోజువరకూ నేను లల్‌కు ఫోను చెయ్యలేదు. ఎంతో అలసటగా ఉన్నది. జీవితరంగం రాటంలా తిరుగుతూంది. కేంద్రం లల్ అతనొక్కడే నన్ను అర్థంచేసుకోగల వ్యక్తి. నాకుసహాయం చేయగల వ్యక్తి. అతను నాకు నాజీవితంలో ఎంతో అవసరం.

ఒక్కమాక్కలో నామనస్సులో ఉన్నమాట చెప్పాలంటే నేను లల్‌ను ప్రేమించానినాలి. అతనితో కలిసి మళ్ళీ హోటళ్ళకు వెడుతున్నాను. రతిక్రీడజరిపిన తరువాత లల్ వెల్లికిలా పడుకుని కళ్ళుమూసుకుని 'నన్ను ముద్దాడవూ'- అని అడిగాడు.

నేను వెంటనే అతన్నిముద్దాడాను.

'నీవునిద్రమత్తుగా ఉన్నట్టున్నావు'- అన్నాడు లల్.

'నువ్వు ఒక చిన్న'జంతువు'వి జంతువులకు సలిపితేరస

## 3

తరువాత దాహంవేస్తుంది. లేదా నిద్రవస్తుంది'-అన్నాడు.

'నీవంటే నాకెంతఇష్టమోఅన్న విషయాన్ని గురించి తలపోస్తున్నాను'-అన్నాను.

'నీవంటేమటుకు నాకు ఇష్టంలేదా?'-అన్నాడు లల్.

ఇంతవరకు నవ్వుకున్నాం. అతడు నన్ను మళ్లీ బోర్డింగ్ హౌసుకు తెచ్చి వదలివెళ్లాడు.

ఆ మరుసటిరోజున మళ్ళీ నాయింటికి ఎందుకువెళ్లాలి.

## 4

మరుసటిరోజు ఉదయం కులాసాగా నిద్రలేచాను. నిద్రపోయిగాపట్టిన రాత్రులకంటె నిద్రపట్టని రాత్రులేనాకు ఎంతోసుఖంగా కనిపిస్తాయి. నిద్రలేచి కిటికిదగ్గరికివెళ్లాను. గాలి చల్లగా వీస్తున్నది. ఒకసారాటు అద్దంలో ముఖంచూచుకొనిమళ్లీ పక్కమీద పడుకున్నాను!

'ఇది మంచులా గడ్డకట్టుకుని పోతూంది'- అన్నానుబిగ్గరగా

'అమ్మాయ్! ప్రస్తుతం నీవు ప్రణయయాలాపంలో వున్నావు. అంచాతనీకు షికార్లు - స్నేహితులతో పిచ్చాపాటి ఇలాటివి అవసరం'- అనుకున్నాను. తరువాత స్నానం చేసి లల్ దంపతులతో విందు ఆరగించడానికి బయలుదేరాను. లల్ ఇంటికి చేరేసరికి మరో అతిథికూడా అక్కడే ఉన్నాడు. లల్ ఇంకా ఆఫీసునుంచిరాలేదు. మేము పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ ఉండగా లల్ వచ్చాడు. రాగానే కొత్త అతిథిని పలకరించాడు. మా ప్రక్కనే ఒకకుర్చీలో

కూచున్నాడు. ఫ్రాంకాన్ లిల్‌వంక చూచి ఓమాటు చిరు
నవ్వు నవ్వింది.

'పిచ్చివాడా! నువ్వూ అందర్లాయిలాగానే చిక్కిపో
యావు. ఏమైనా ఈనాటకానికి నేను తెరదించదలచుకున్నా
ను. నేను బెర్ట్రాండుతో ఒకవిషయం చెప్పబోతున్నాను'-
అన్నది ఆవిడ. తరువాత బెర్ట్రాండుతో తాను చెప్పదలచుకున్న
విషయం ఏదో మాకు వివరించిచెప్పింది. నేను మాటమాటకి లిల్‌తో
సంభాషణ ప్రారంభించలేదు. ఆవిడ సాన్నిధ్యంలో
లిల్‌తో మాటలబంతుల ఆట ఆడడం నాకంత ఇష్టంకాదు.

తరువాత నేను లిల్‌ను తరుచుగా కలుసుకోడం మానే
శాను. ఒక సారి బార్‌లో లిల్ కనుపించాడు. కాని పర
స్పరం క్షేమసమాచారాలను మాత్రం విచారించుకుని ఎవరి
దోవన సాగివెళ్ళాం.

ఏమైనా ఒక వివాహితుని ప్రియురాలిగా ఉండడానికి
మటుకు నేను సృష్టించబడలేదన్న విషయంనాకు స్పష్టమైంది.
నేను లిల్‌ను ప్రేమించినమాట వాస్తవమే. నేను కాలం
ఎలాగ గడుపుతున్నానని లిల్ ప్రశ్నించాడు. పుస్తకాలు చదు
వుకుంటూ ఉన్నానని చెప్పాను. కాని ఈమాట నిజంకాదు.
నేను పుస్తకాలు చదువుకోడమూ లేదు. సినిమాలకు వెళ్ళడ
మూ లేదు. ఒకరోజున అలియన్ అనే మిత్రుడికి ఈ కథంతా
చెప్పాను. మేము మెల్లు మెళ్ళు నవుస్తూ ఈవిషయాన్ని
ఒకనవల గురించి చర్చించినట్టుగా చర్చించాము. 'ఒక
రోజుకు ఈనాటకం ముగిసిపోక తప్పదు. ఆరునెలలు కావచ్చు
లేక ఒకసంవత్సరం కావచ్చు. కాని అనాడు నీవు ఈవిష

యాన్ని గురించేనవ్వుతూ ప్రస్తావిస్తావు'-అన్నాడు మిత్రుడు

'లల్ నన్ను ప్రేమించడం లేదేమో'- అనుకున్నాను నాలో నేను. ఈభావంనామనస్సులో తళుక్కున మెరిసేసరికి ఎవరో నాగుండెల్లో బాకుపెట్టి పొడిచినట్టయింది. నిజంగానే జరగవలసిఉన్న ఈసంఘటన ఒకటినా సాయంకాలం జరగనే జరిగింది. నేనూ లల్ నాకార్లో వెళ్తూఉన్నాం.

'నేను ఒకనెలపాటు అమెరికా వెళ్ళవలసిన పనివున్నది' అన్నాడులల్. 'ఒకనెల! అమ్మయ్యో!'- అన్నాను.

'నేను తిరిగివచ్చేసరికి నన్ను మరచిపోతావనుకుంటాను'- అన్నాడు లల్. 'అదేం?'- అన్నాను.

'నీలోమార్పువస్తుంది. మంచికోసమే'- అన్నాడులల్.

నేను లల్ వంక చూచాను, అతనిముఖంలో విషాదం ముద్రితమై కనుపించింది.

'లల్, నేనుభరించలేను, నీవునన్ను విడిచివెడితే భరించలేను'- అన్నాను. ఇలా నేను అంటున్నప్పుడు నాకంఠస్వరమేకు నాఆశ్చర్యం కలిగించింది. అతని చెక్కిళ్ళు నా కన్నీటితో తడిశాయి. ఎంత విచిత్రమైంది విషాదం. విషాదంనుంచి విముక్తిపొందడం ఎంతకష్టసాధ్యం! మరునటి రోజున ముస్తాబు ముగించుకుని క్లాసుకు వెళ్ళనున్న సమయంలో పరిచారికవచ్చి నన్ను ఫోన్‌లో ఎవరో పిలుస్తూ ఉన్నారని చెప్పింది. నేను ఫోన్ తీసుకున్నాను.

'అమ్మాయ్!'- ఫ్రాంకాస్ గొంతుక వినిపించింది.

'ఈసాయంకాలం ఒకమాటువచ్చి నన్ను కలుసుకుంటావ్?'-అన్నది ఫ్రాంకాస్.

తరువాత ఫోన్ పెట్టేసింది.

నేనుమళ్లీ క్లాసుకు వెళ్ళలేదు. నగరవీధుల్లో తిరుగుతూ ఆరోజంతా గడిపాను. సాయంకాలం ఆరుగంటలు కావ స్తూంది. సన్నగావానజల్లు పడుతూవున్నది. మెల్లగా లల్ ఇంటికివెళ్లాను. ఫ్రాంకాస్ వచ్చి తలుపు తెరిచింది.

'ఎలా ఉన్నావమ్మాయ్, కులాసా!'– అని అడిగింది.

నన్నులోనికి తీసుకునివెళ్లి కూచోమన్నది. ఒక గ్లాసులో విస్కీపోసి అందించింది.

'అమ్మాయ్! నీవు చిన్నదానివి — నీవంటేనాకు అసూయ—అందులో అసహజమైన విషయమేమీలేదు — అమ్మాయ్ – నీకూ లల్‌కు మధ్యజరిగిన విషయాలన్నీ నాకు తెలుసు. కాని నీవుచిన్నదానివి...నీవు ఇలాకావడం నాకు ఇష్టంలేదు—'అంటూ చెప్పసాగింది ఫ్రాంకాస్.

మరి పదిరోజులు గడిచాయి. లల్ ఊరికి వెళ్లాడు. ఊరినుండితిరిగిరాలేదు. పూర్తిగామరిచిపోయాననేచెప్పవచ్చు ఒకరోజున పరిచారికవచ్చి నాకు ఫోన్ అందించింది. ఫోన్‌లో లల్ కంఠస్వరం వినిపించింది.

'ఎలాఉన్నావమ్మాయ్? కులాసా?'–

'ఊఁ'–

'రేపు ఒకమాటు విందుకువస్తావా?'.

'ఊఁ'–

నేనుగదిలోకివెళ్లాను. అద్దంలోముఖంచూచుకున్నాను నాలోనుంచి ఏదో వెళ్ళిపోయినట్టుగా అనిపించింది. ఒంటిగా మిగిలాను. అవుతేనేం?

ఒకస్త్రీని. ఒకపురుషుని ప్రేమించిఅనుభవంఆస్తి.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B146 |
| పుస్తకం పేరు | దాగుడు మూతలు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 63 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |